## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# భారతేతిహాసములు.

(ప్రథమభాగము.)

శ్రీ పిఠాపురము మహారాణీవారి గోషాస్కూలులో

ఉపాధ్యాయినియగు

జూలూరి తులశమ్మచే

రచింపఁబడినది.



ప్రథమముద్రణము.

పిఠాపురము.

శ్రీ విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపఁబడియె.

 1931. [ వెల రు 0-8-0

# పీఠిక.

ఇంగ్లీషుభాషయందు సుప్రసిద్ధములగు కావ్యములు, నాటకములు, నవలలు మొదలగు గ్రంథములు విద్యార్థుల యుపయోగముకొఱకు సులభమగు వచనశైలిలో చిన్న చిన్న కథలరూపముగ వ్రాయఁబడుచున్నవి. ఇట్టిగ్రంథములు వేల కొలఁదిగ కలవు. బాలబాలికలకు గ్రంథపఠనాసక్తిని పెంపొందించుచు భాషాజ్ఞాన మలవరచుచు, సారస్వతప్రపంచవైచిత్ర్యముల నించుక కనఁబఱచుచు నీపుస్తకములు రచయితల యభీష్టమును నెఱవేర్చుచున్నవి. ఆంగ్లేయవిద్యావిధానము మనదేశమున నెప్పుడు నెలకొనియున్నదో, అప్పుడే ఈరీతి గ్రంథములు మనకును నావశ్యకములై యున్నవి.

బాలబాలికల కుపయోగకరములగు గ్రంథములు వ్రాయుట మనదేశమునకు క్రొత్త. కవులును, పండితులును సంస్కృతసమాసభూయిష్ఠములై పండితులకైనను సులభగ్రాహ్యములు కానిరీతిని పద్యగద్యగ్రంథములను నిర్మించుట యందే వారిశక్తుల వినియోగించుచుండిరి గాని ప్రజాసామాన్యమునకు బాలబాలికల కుపకరించునట్టి పుస్తకములను వ్రాయరైరి. రాజకీయపాఠశాలలయందలి విద్యావిధానము నెఱింగిన యుపాధ్యాయులును, పండితులును ఈకొరతను తొలఁగించుటకు గతపదిసంవత్సరములనుండియు వీడని పరిశ్రమచేయుచున్నారు. అయినను పాశ్చాత్యదేశములలోవలె బాలురు

స్వతంత్రముగా ఉపాధ్యాయుల సాహాయ్య మపేక్షింపక యే చదువుకొనఁగలుగు గ్రంథములు వలసినన్ని బయల్వెడలలేదు. ముందుముం దట్టిభాగ్యము వారికి చేకూరఁగలదని యాశించుచున్నారు.

భారతమునందు వందలకొలఁది చిన్నవియు, పెద్దవియు నగు నుపాఖ్యానములు గలవు. ఇవి నీతిదాయకము లగుటఁ యేగాక చదువరులకు మిక్కిలి రమ్యముగను మనోహరముగను నున్నవి. ఉన్నతాశయములు శత్కృష్టభావములు విచిత్రకథా సంవిధానములు వీనియందలి విశేషములు. భారతేతిహాసములు ప్రథమభాగము అను నీచిన్నిగ్రంథమునందు, ఆదిపర్వమునందలి యుపాఖ్యానము లొకచోఁ జేర్చి సులభశైలిలో వ్రాయఁబడియున్నవి. కథలలోని విషయములను సంకుచితము చేయక, మూలములో భావములను మరుఁగుపఱుపక కడునేర్పుతో రచించిన జూలూరి తులశమాంబగారు చదువరుల మన్ననల నందుదురని యాశించుచున్నాను. కావ్యనాటకాదులు మృదుమధురముగ రచింప నేర్చిన యీమె బాలబాలికల కుపయుక్తములగు నిట్టిగ్రంథములు వ్రాయునట్లు సర్వవిధముల ప్రోత్సహింపఁబడుగాక.

రాజమండ్రి.
29-12-30.

టి. వి. రంగనాయకమ్మ,
B. A. L. T.

# విషయసూచిక.







శ్రీ

# భారతేతిహాసములు.

## ప్రథమభాగము.



శ్రీమదఖండభూమండలంబునకుఁ దిలకాయమానం
బగు హస్తినాపురంబు చంద్రవంశప్రదీపు లగు రాజశిఖామ
ణులచేఁ బరిపాలింపఁబడుచుండెడిది. దానికిఁ గురుక్షేత్రము
రాజధానియై యొప్పుచుండెను. అట్టియున్నతవంశంబున శమ
దమాదిసత్త్వసంపన్నులు, ధర్మనిరతులు, సత్యవ్రతదీక్షితులు,
శాంత్యాది గుణవిభాసితు లెందఱో పుట్టిరి. కడపటి
కావంశమునందే కురుపాండవు లుదయించిరి. వారిలోఁ బాం
డురాజున కేవురు పుత్త్రులు గలిగిరి. వారిలోఁ బ్రథముఁడు,
ధర్మరాజు. అతఁ డజాతశత్రుఁడు, నిత్యసత్యవ్రతుఁడు, నిర్మ
లయశోధనుఁడు నయ్యును బెదతండ్రి యగు ధృతరాష్ట్రుని
యందు భక్తివిశ్వాసములును వినయవిధేయతలును గలిగి యత
నియానతిచొప్పున వర్తించుచుండెడువాఁడు. అతనిసోదరు లగు

భీమార్జునులును మాద్రేయు లగు నకులసహదేవులును గూడ నన్న యడుగులజాడ ననుసరించుచుండెడువారు. ధర్మరాజు రాజసూయ మను గొప్పయజ్ఞమును గావించెను. ఆక్రతువునకు వలయు ధనధాన్యాదిపరికరములు భీమార్జుననకులసహదేవులును, మిత్రులును, బంధువులును సామంతరాజులును సమాధానపఱిచిరి. అర్జునుఁ డుత్తరకురుభూములను జయించి లెక్కకుమించిన ధనమును గొనివచ్చి యాగార్థమై యొసఁగెను. మయుఁ డను శిల్పి యమూల్యాలంకారశోభిత మగు నొకసభ నొసంగెను. తాను సేయు యాగమును జూచుటకై వసుంధరావలయమునఁ గలవారి నెల్ల రావించెను. వారిలో మానధనుఁడును, నీర్ష్యాగుణవిధేయుఁడును రాజరాజు నగు దుర్యోధనుఁడుగూడ వచ్చిన వారిచే మన్ననలంది, ప్రశస్తమగు దానకార్యమునందు నియుక్తుఁడై పరమోత్సాహమున నుండెను. కార్యమంతయు సంపూర్ణమైనది. కడపటిదినంబున సభను జూచుటకు ముచ్చటపడి దుర్యోధనుఁ డందలిశిల్పనైపుణము వలనఁ గల్గినవివృసంవృత, జలస్థలాదిప్రదేశములఁ దెలిసికొనఁజాలక, జలాభావస్థలంబునఁ దనదోవతిచెఱంగును బట్టుకొనుటయు సంవృతద్వారము తెఱచియున్నదని తలఁచి తలను దగుల్చుకొనుటయుఁ జూచి ద్రౌపది సద్గుణనిధాన యయ్యును స్త్రీచాపలంబున నవ్వెను. "నవ్వు నాలుగువిధముల చెఱుపు" గదా ? అదియే కలహకారణ మైనది. అంతట నాదుర్యోధ

నునిహృదయమున నున్న నీర్ష్యానలము తగులొన్నది. ఆరీతిని గోపపరీతహృదయుండై తండ్రి నెట్లో యొప్పించి ద్యూతవిశారదుం డగు శకునిం బిలిపించి జూదమునం దభిలాష గల ధర్మజుని విదురునిచేఁ బిలిపించి జూదమాడించెను. ఆకుష్టద్యూతంబునఁ గాలాధీనుండై ధర్మరాజోటువడి సమయము సెల్లించుకొనుటకై కాంతాసోదరసహితముగ ద్వైతవనంబునకుఁ జనియెను.

ఇట్లా వల్కలములు ధరించి వనవాసదీక్షాతత్పరుం డగు ధర్మరాజును దర్శించుటకు వేనవేలు మహాఋషు లతనియొద్దకు వచ్చి ధర్మంబుల బోధించుచుండెడువారు. ఒకదినంబున రోమశుం డను మానిపుంగవుఁడు, ధర్మరాజునాశ్రమంబునకు వచ్చి ఆయన యొసంగిన పూజలం గైకొని యానందించి ఆయా పుణ్యతీర్థంబులవిశేషంబులఁ దెల్పుచు తనచూపుడువ్రేలితో జూపుచు ధర్మరాజా! ఇది రైభ్యమహాఋషియాశ్రమము, ఇయ్యది భరద్వాజాశ్రమంబు; ఇందు భరద్వాజసుతుం డగు యవక్రీతుఁడు తపంబునను విద్యవలనను మిక్కుటం బగు గర్వముగలవాఁడై ప్రాణము గోల్పోయెనని చెప్పెను. అప్పుడు ధర్మజుం డదియె ట్లని యమ్మహర్షి నడుగుటయు రోమశుం డవక్రీతుని కథ యిట్లని చెప్పందొడంగెను.

# అవక్రీతుఁడు

అయ్యా! ధర్మరాజా! విశుద్ధతపోమహిమచే నిశ్చల చిత్తులగు రైభ్యభరద్వాజులు నిరంతరబ్రహ్మజ్ఞానతత్పరులై స్నేహభావము గలిగి యాయాశ్రమంబున వసించెడువారు.

వారిలో రైభ్యునకు నర్వావసు, పరావసు లను నిరు వురు తనయులు గలరు. వారు వేదపఠనమునం దగ్రేసరులు. సద్గుణసంపన్నులు, నియతచిత్తులు, పితృసేవాసక్తులు నగు సుపుత్రులచే సేవింపఁబడుచు రైభ్యుఁడు నిత్యానందయుక్తుఁడై యుండుటను జూచి, భరద్వాజపుత్రుఁ డగు అవక్రీతుఁడు వారివిద్యాసంపన్నతను సహింపఁజాలక సర్వకార్యసిద్ధికిని తపస్సే కారణ మనియును దానివలన వేదములును, వేదాంగ ములును బడయుదు ననియు నిశ్చయించుకొని ప్రజ్వలించుచు న్నయగ్నియందు హవిస్సులను వేల్చుచు నియతచిత్తుఁడై యుగ్ర తపంబు గావించుచుండెను.

— ఇంద్రుఁడు అవక్రీతునియొద్దకు వచ్చుట —

ఇట్లు, అవక్రీతుఁడు తపంబు గావించుచుండ దేవేంద్రుఁ డాతనిసమీపమున కరుదెంచి, "ఓయీ? అవక్రీతుఁడా! నీ విట్టిఘోరతపంబు గావించుటకుఁ గారణ మేమి?" అని యడిగెను. అప్పు డాతని కవక్రీతుం డిట్లనియెను. "రేలుంబ

వల్లో కాయకష్టములకు సహించి, నిద్రాహారములను మాను కొని గురుశుశ్రూష గావించుచు అందువలన గురునకుగ్ర హము వడసినఁగాని విద్య లభించుట దుర్లభము. అట్లయినను బెక్కుదినంబులకుఁగాని సంభవింపదు. విద్య యనెడు మహా ధనమును బొందుదమన్న ననేకములగు నంతరాయములు గలు గుచుండును. కావునఁ జదువకుండఁగనే సర్వవేదములును సకల శాస్త్రములును సంభవింపవలయు నను తలంపు గలిగి శ్రద్ధా భక్తులతోఁ దపంబు సేయుచుంటిని. ''

## — ఇంద్రుఁడు అవక్రీతునికి బదులు చెప్పుట. —

ఇంద్రుఁడు—ఓయీ, మునిపుత్రా! నీవనాలోచనా పరుఁడవై విద్యలయందలి లోభమున నిట్టిసాహసమునకు సము కట్టితివి గాని, అ ట్లెన్నఁటికినిగాఁజాలదు. ఏమందువా? విద్యా గ్రహణం దాసక్తిగలవా రెవ్వరైనను బ్రహ్మచర్యదీక్షను బొంది నియతచిత్తులై కష్టసుఖములను లెక్కసేయక గురు సేవాతత్పరులై యతనియనుగ్రహమును బడసినఁగాని గురు ముఖమునుండి వెలువడిన విద్యాతేజము శిష్యుని ముఖమునఁ బ్రవేశించి విద్యాసంపదచే గురువర్యునితో సమానునిగఁ జేయఁజాలదు. గురుముఖనిర్గళిత మగు విద్యయం దంతశక్తి యున్నది. బాలకా! ఊరక బేలతనంబునఁ దపంబుగావించి కాల మంతయు వృథసేయుటవలన నించుకైన లాభము లేదు.

రసములు పాత్రియందుం బునిచినను అగ్నిస్పర్శ గాకున్నఁ బక్వము
గాఁజాలనియట్లే శిష్యుఁడు నిరహంకారుఁడై నిర్లజ్జుఁడై శుశ్రూష
గావింపనిచో గురుదేవుని పరమానుగ్రహంబును బడయఁ
జాలఁడు. కావున, కాయిక, వాచిక, మానసిక శుశ్రూషల
వలన శిష్యుఁడు సేవసేయుచు, ఆత్మార్పణము గావింప
వలయును.

అప్పు డావిద్య పుటముఁ దీసిన బంగారుకంటె తేజోవం
తమై, అమూల్యమై, నాశరహితమై ప్రకాశించును. దాయా
దులవలన నశింపదు. చోరులు గొనిపోవుదు రను భీతి యుం
డదు. విద్యాపాత్రదాతకును పరిగ్రహీతకును నపరిమితానంద
మును గలిగించును. పరదేశమునందు మిత్రునివలె నెడబాయ
కుండును. కష్టపడి గడించిన విద్యాధన మెట్టియిక్కట్టులయం
దైన సాయపడును గాని, తపశ్చరణవలన విద్యలు గడించి
దానివలన నభీష్టములను బొందఁగల ననుకొనుట వట్టిభ్రాంతి.
అభీష్టములఁ బొందుట యటుండనిమ్ము. మీఁదుమిక్కిలి
మదము, మత్సరము, నహంకార మున్నగు గుణంబు లెట్టిసాధు
లకైనను గలిగించును. బిడ్డా! ఇది విద్యోపార్జనంబునకు సాధ
నంబు గాదు. కావున నీప్రయత్నము విడిచిపెట్టి గురుముఖం
బున విద్యలం బడసి సుఖింపుము." అని చెప్పి నిజనివాసమున
కరిగెను.

## —♦ యవక్రీతుఁడు తపంబు సేయుట. ♦—

ఇంద్రుని బోధనల చెవిఁ బెట్టక యవక్రీతుఁడు తనలో నాలోచించె తపంబునుగూర్చిన చింత యితని కేమిటికి? ఏ విధానమున నైన విద్యలఁ బడయుట యవసర మగుఁగాని యిట్టి విధానమున విద్యఁ బడయరాదు, ఇట్టివిధమునఁ బొందవచ్చునను భేద మెక్కడ నున్నది? నానియతిని బరీక్షించుటకై యింద్రరూపమును బొంది వచ్చిన ధర్మదేవత కాదుగద! ఉత్తములగు పురుషు లెన్నికష్టములు సంభవించినను లెక్కసేయక మిక్కుట మగు నోరుపుతో నాకార్యమును సముత్తీర్ణు లగుదురు. మధ్యము లట్టివిఘ్నములకు లొంగి భీరువులై యారంభశూరులై విడిచివైతురు. నీచమానవు లన్ననో రాఁబోవు విఘ్నములకు భయపడి యేకార్యమును జేయుటకును బూనుకొనక నిర్వ్యాపారులై నిరక్షరకుక్షులై కాకివలెఁ బొట్ట నింపికొనుచుఁ గాలము గడపుచుందురు. కావున నిప్పుడు సేయఁబోవు ప్రయత్నమునుండి మరలుటకు నాయంతరాత్మ నిశ్చయించుటలేదు. ఏది యెటు లున్నను బురుషప్రయత్నమునకు సాధ్యము కాని దేమున్నది? యని తలంచి యాప్రయత్నము నుండి మరలక విజితేంద్రియుఁడై యుగ్రతపము సేయ నారంభించెను. అతని తీవ్రతపంబున లోకంబున కెట్టియాపదలు మూఁడునో యనుతలంపునఁ దప్తచిత్తుఁడై వృద్ధశ్రవుండు వృద్ధబ్రాహ్మణరూపధారియై యాతపోవనపరిసరంబున నున్న నదీ

తీరంబున నిలువఁబడి యవక్రీతుని పట్టుదలకు నచ్చెరు వొందు చుండెను.

అతఁడు మిగుల బలహీనుఁ డగుటచే శోషించి ముడు తలుపడిన కాయముతో వజవజ వణఁకుచు నెట్టిప్రబలకార్య మును జేయఁబ్రయత్నించెనో చూడుఁడు! కార్యము చేయు టయం దాసక్తి గలవానికి బలహీనతతోఁ బనిలేదు. పట్టుదల యే ముఖ్యకారణము.

మిగుల లోఁతు గలిగి స్వచ్ఛమగు జలప్రవాహపూర ముచేఁ బొరలిపొరలి యొడ్ల నొరయుచున్న గంగానదిని సమీపించి యందలిసుకను తనగుప్పిళ్లతో నెత్తుచు నదీమ ధ్యమున సేతువు నిర్మింపఁగలిగెను.

ఎన్నిదినము లట్లు గావించిన నాపని నెఱవేఱుట లేదు. గభీరగంగాప్రవాహ మాఁగనందులకు విసుగుఁజెందక పట్టుదలతోఁ బనిచేయుచుండెను. ఆబ్రాహ్మణుని ప్రయత్న మున కవక్రీతుఁడు నవ్వుచు "ఓయీ! విప్రోత్తమా? నీకు నూఱుసంవత్సరములవయస్సు గడచిపోయినది; నీశరీరము కడుంగడు కృశీభూతమై యున్నది. వణఁకుచుండుటచేఁ జేతు లు పట్టుపట్ట నవశము లగుచున్నవి. ఇట్టినీ వింతదుర్ఘటకా ర్యము సేయఁ బ్రయత్నించుటయెంతహాస్యాస్పదముగనున్నది! బల మంతయు సడలిపోయినది నీవు నీశక్తినైనఁ దలంచుకొనక యశక్య మగు నర్థంబున కాస నొందుచుంటివి. ఇంతవెఱ్ఱిత

నంబు గలదే ! ఆశానిబద్ధులైన కుమతులు తమశక్తిసామర్థ్యా బుల గుర్తెఱుంగక యిట్టియపూర్వకృత్యములు సేయుటకుఁ బ్రయత్నించుచుందురు.

ఓయీ ! దుర్మతీ! నీవు చేయుచున్న యీకార్యమెన్ని దినములకు సమాప్తి చెందఁగలదు ? ఎవరేకార్యమును జేయఁబూనుకొందురో వారందునుగూర్చియును రాఁబోవు విఘ్నములనుగూర్చియును ముందువెనుకలఁ జక్కఁగ విచారింపక కార్యభారమును పైని బెట్టుకొందురేని యాకార్యము నందు వారు సఫలమనోరథులు కాకపోవుటయే కాక దుఃఖాస్పదులుగూడ నగుచుందురు. కాని, విప్రోత్తమా ! తరమెఱుంగక యేపనిని గాని తలంపరాదు. ఇంక నీప్రయత్నము నుండి వెనుకకు మరలి సుఖపడుము. ” అని పలికెను.

—• ఇంద్రుఁడు అవక్రీతునకుఁ బ్రత్యక్షమగుట •—

అప్పు డింద్రుం డవక్రీతునకుఁ బ్రత్యక్షమై “ అవక్రీతా ! నన్ను దుర్ఘటమగు కార్యమునందుఁ జొచ్చితి వనుచుంటివా ? అది సత్యమే, నాయందుగల దోషము లన్నియు నీకు నప్రయత్నముగ గోచరించుచున్నవి గాఁబోలునేమి ? పరులదోషముఁ దడవెడు వారికిఁ దమదోషములు గానరా వని పెద్దలు చెప్పుదురు. అది సహజమేగదా ? ఏల యందువా ? తనయెదుటఁ గన్పట్టుచున్న పదార్థము లెస్సగఁ గాంచఁగలిగి

నట్లు తనయందున్న పదార్థమును తా నెట్లు తెలిసికోఁగలఁడు. ఎఱుక గల మనుజు లట్లు గాదు. తమయందలిలోపాలోపములను మునుమున్న పరిగణించుకొని వానియేపు మాపుటకుఁ బ్రయత్నించి పరులను మిత్రకోటి యని తలంచియనువైనయపుడెల్ల వారికిని సద్బోధము గావించి మంచిమార్గమునకుఁ ద్రిప్పఁజూతురు. కావున నీవు నీతప్పును తెలిసికొనుటకుఁ బ్రయత్నింపుము. నిన్ను నీవు పరిశీలించుకొనుట కలవాటు పడితివేని పరులదోషములకంటె నీదోషము లధికముగఁ గానవచ్చును. అప్పుడు నీమార్గమును నీవే చక్కఁజేసికొని దానినే యితరులకుఁ బ్రదర్శింతువు. అదియే యుత్తమపురుషలక్షణము. నీప్రయత్నమును జూచి నీవలెనే నేనును దుర్ఘటకార్యముఁ జేయుటకుఁ బూనుకొంటిని. నీవు నీతప్పును తెలిసికొనఁజాలక న న్నధిక్షేపించుచుంటివి. మన మిరువురమును నఘటితార్థంబునకుఁ బ్రయత్నించెడు వారమే. వెనుకటిసంగతులు దడవుట యెందులకు? అయిన దేదో యయినది. ఇఁక నైనను వెఱ్ఱిప్రయత్నములు విడుచుకొమ్ము." అని మందలించెను.

— అవక్రీతుఁ డింద్రునిచేఁ దపోభిమతములఁ బడయుట —

అంతట నవక్రీతుఁడు, "ఓవృద్ధవిప్రా ? నీవు వృద్ధబ్రాహ్మణుఁడ వనుకొంటిని గాని నాయజ్ఞానమును గనుంగొనవచ్చిన శచీప్రియుఁడ వని యెఱుంగఁజాలనైతిని. అట్టి నాయ

వజ్ఞతను మన్నించి నాకోర్కులను సఫలముగావింపుము. నీవు నా కుపదేశించిన ధర్మము లన్నియు నాచరణీయములే. అవి యన్నియుఁ బుష్పమాలతెఱంగున శిరంబున ధరించెదను. అయినను నాతలంపున నాటికొనియున్న కోర్కెవలన సంభవించిన శుభాశుభంబుల ననుభవింపవలసినవాఁడనే కాని సిరర్థకప్రయాసం బని జంకువడి వెనుదీయువాఁడను గాను. సర్వజ్ఞులగు మీరె తెఱంగిని యర్థం జెందుఁగలరు? నాపూనిన కార్య మర్థవంతము గాదని మీపలన నెఱింగి వెనుదీసిన నారంభశూరుఁ డని లోకనింద పడయవలసివచ్చును. అదియుఁగాక నాలోచనీయాంశమే. ఏది యెటు లున్నను నిక్కార్యమునుండి వెనుకకు మరలువాఁడను గాను. నాయభిమతంబుల సఫలంబు గావింపక మీపాదంబుల విడువ" నని యతని పాదపద్మంబులకుఁ బ్రణుతిగావించెను. అంతట నాపురుషోత్తముఁ డపకీర్తిని కార్యదీక్ష కబ్బురపడుచు మా యుపలుకక యభిమతంబులఁ బడయు మని యాశీర్వదించి నిజావాసంబునకుఁ జనియెను.

అంత నాతఁడు శత్రువనుగ్రహంబునఁ బడసిన విద్యాలాభంబునకు సంతసించి యటనుండి వెడలి తనతండ్రియాశ్రమంబునకుఁ జని శాంతము రూపొందినవిధంబునఁ దేజరిల్లుచున్న భరద్వాజుం గని తనయభిమతంబుల నింద్రునివలనఁ బొందితి నని గర్వయుక్తముగఁ బల్కిన కుమారుని గర్వము

నకు సహింపఁజాలక, భరద్వాజుఁడు, "కుమారా! ఎట్టివా
రికైన గరువము తగదు. అందుఁ దపోనియమంబులచేతను, నియతాహారనిష్ఠలచేతను బ్రొద్దులు పుచ్చుచున్న కోటితపస్వుల కది కొంతయుఁ దగనిపనిగదా! కాని, అది యెడుగక పుట్టి వారికేని సుఖసంతోషంబులు గలుగఁజాలవు."

—♦ అవక్రీతునకు భరద్వాజుండు గర్వమువలన హానిని దెల్పుట ♦—

భరద్వాజుఁడు-"బాలకా! పూర్వ మొకప్పుడు గర్వాతిశయంబువలన సంభవించెడు చెడుగు దేవగీతలయందుఁ జెప్పఁబడియున్నది. అద్దానిని వినుము. బాలధి యను మునిప్రవరునికుమారుఁడు విధివశంబున నకాలమృత్యువువాతఁ బడియెను.

"అప్పు డా బాలధి పుత్రమరణంబునకుఁ జింతించి చింతించి కడఁగానక దుఃఖము దిగనాడి, దేవతలఁగూర్చి ఘోర తపంబు గావించెను. అట్టిమహాతపంబునకు వేల్పులు మెచ్చి నీ వెందులకు నిట్లు తపంబుగావించుచుంటివని యతని నడిగిరి. అంత నతఁ డయ్యలారా! పుత్త్రులు లేనివారి కిహపర సుఖంబులు లేవని ధర్మశాస్త్రంబులు ఘోషించుచున్నవి. ఇహలోకంబున బిడ్డలు లేనిగృహం బాంధకారమయంబు. సంతతిఁ బడయనివారు [illegible]లు లేనికుసుమములవలె చింతనొందుదురు. మంత్రపూతంబై కుమారుం డిడిన నివాపహారియు,

పిండదానంబును బరలోకయాత్రాపరుం డగు తండ్రికి శుభా ధారములై యుత్తమలోకంబులకుఁ గొనిపోవు నని ధర్మపర తంత్రులు చెప్పుచున్నారు. కావున మహామహులారా! ఉభ యలోకఫలసిద్ధికరుం డగు నాకుమారునిఁ బునర్జీవితునిఁ గావిం పుఁడనిన దేవతలు వల్లె యని యతనికి మేధావియను నాయు ష్మంతుండు నగు పుత్త్రు నొసంగిరి.

„ఆకుమారుఁడు నానాటవృద్ధినొంది యాయుష్యగర్వం బున విజృంభించుచు మునీంద్రుల కెగ్గుసేయుచు కడుఁగడు నక్రో ధనుఁడై ధనుషాక్షుం డను తపోధనునియాశ్రమంబునకుఁ జని యందు నివృత్తుఁగప్పిన నిప్పువలె శాంతభావముతో నంతర్ము ఖుండై యున్న యాతపోధనునిఁ జూచి గర్వాంధుఁడై పలికిన కఠినోక్తుల కలిగి యాతఁడు, „ఓ బాలకా! నిస్సంగుఁడనై తపంబుగావించుకొను చున్న నాయొద్దనా నీగర్వప్రలాపం బులు? నీగరువంబును గడముట్టఁ గుందించువా రెవ్వరు? నీ వంతకుని పాలి కరుగుము. ధర్మాధర్మములను పాపపుణ్యం బులను గుణదోషంబులను సమముగఁ బరిశీలించు ధర్మస్వరూ పుఁడతఁడు. అట్టివాఁడు గావుననే యతనికి సమవర్తి యను సార్థకనామము గలిగినది.” అని యాతనినొప్పగ కంపించెను ”

కావునఁ బుత్త్రికా! చెట్టపుట్టించు గర్వమును విడువుము. మెచ్చుదెచ్చు శాంతమును పరిపాలింపుము. గర్వం బెట్టివారినై నను దగ్ధంబు నశింపఁజేయును. గర్వమును విడిచి ప్రవర్తించి

త్తుఁడై మెలంగినవాఁడే యుత్తముఁడు. కావున నీవ క్రోధనుఁడవై సమానబుద్ధి గలిగి పరమశాంతులగు రైభ్యునికొడుకులతో నిర్మత్సరుఁడవై మైత్రి నెఱపు" మని తెల్పెను. అందుల కవక్రీతుఁడు సమ్మతించి నాకు రైభ్యునిఁ జూచిన మిమ్ముఁ జూచిన ట్లుండును. ఆతఁడు నాకుఁ బితృతుల్యుఁడు. వాని యెడల నాకించుకైన భేదములేదు. మీయానతి ననుసరించి యటులే కావింతు నని చెప్పి తనవిద్యావిభవము నచ్చటచ్చట వెల్లడిసేయుచు నొక్కనాఁడు నిత్య వేదనాద విలసిత మగు రైభ్యునియాశ్రమమునకుఁ జనియెను.

—• అవక్రీతుఁడు రైభ్యాశ్రమంబునకు వచ్చుట •—

రైభ్యాశ్రమమున నాతనిశిష్యులు వేకుజాముననే మేల్కాని గురుదేవునిసహితముగ నేటికిఁ జని స్నానసంధ్యాది విధుల విధ్యుక్తముగఁ గావించి మఱుఁగుదోవతుల నుదుకుకొని వేదమును వల్లెవేయుచు నాశ్రమంబున కరుదెంచి పింజెదోవతుల ధరించి ఆశ్రమభూరుహశాఖలకుఁ గావివస్త్రంబుల నాఱఁగట్టి విభూతిని ధరించి పద్మాసనస్థులై విధివిధానంబున నగ్ని నారాధించి నియమవ్రతులై నిరంతరము సంతోషంబుగఁ గాలంబు పుచ్చుచుండిరి. అది వసంతకాల మగుటచే ఆవనభూరుహము లన్నియు నవలెత్తి శోభావంతములై యుండెను. అందలిపాదపములపై నెగఁబ్రాఁకు మల్లికా, మాలతీలతలు

పుష్పించి నాసాపుటంబులకు విందుసేయుచుండెను. అరవిరిక లికలయందుఁ జొచ్చి మధుపానముఁ జేసి యీవలకు వచ్చి గండుతుమ్మెదలు ఝుమ్మనునాదానందమును వ్యక్తముసేయు చుండెను.

నిరంతరమును శిష్యులచేఁ గావింపఁబడు సామగాన మును విని శుకసంతతులు తాముఁగూడ సామగాన మొనర్చు చుండెడివి. విన్నమొన్న నుదితమైన లేఁత లేఁతచివుళ్ళఁ గొమ్మ కొమ్మకు మధురముగ నాలపించు కోకిలలగుంపులు సొంపునింపు చుండెను. పచ్చికపట్టులయందు దచ్చుటచ్చుట విచ్చలవిడిగ గంతు లిడుచు దూర్వాగ్రంబుల నించుకించుక కొఱుకుచుఁ జెంగు చెంగున గంతులిడు బాలకురంగములఁ దమకొమ్ములఁ గోఁకుచుఁ బరిచితులపజ్జఁ జేరి బుజ్జగింపులచే మూతులు మూర్కొను చుండు లేడిగుంపులు గలిగి యపూర్వశోభచే నలరారుచున్న తపోవనము నిత్యనూతనమై విరాజిల్లుచుండెను.

అవక్రీతుఁ డాతపోవనమునఁ బ్రవేశించి యందలివిచిత్ర ములఁ గాంచుచుండఁ బరావసునిభార్య కృష్ణ యను యువతీ మణి యతనికంటఁ బడియెను. అంత నాతనిచిత్తము చలిం చెను. అంతటనైన నూరకుండక యాపాపుఁడు తనయభిప్రాయ మాయింతి కెఱింగించెను. పాప మప్పు డామె యేమి చేయఁ గలదు ? ఇతనిదుశ్చింతను వెల్లడించిన శాప మిడునేమో

యున్న భీతిచే జాలఁగంది యప్పటి కట్టులే యుండఁగాక యని భర్తకు మెల్లన పుట్టినుండి లేడిపిల్లవలె నతని బారినుండి తప్పించుకొని తొలఁగిపోయె. యాభువుచిప్పలవలె సోగలై విశాలములైన నేత్రములనుండి కన్నీటిబిందువులు జాఱ నవమానపరిభూతయై యాశ్రమద్వారంబున నిలువంబడి శిరంబు వంచి గద్గదికతో దోపఁ గరుణాఖండగు మామ కీవార్తఁ దెల్పెను. ఆ మాట చెవిం బడినంతనే రైభ్యుఁడు జ్వలితాగ్నివలె మండిపడి యయ్యవక్రీతునిపైఁ గల కోపమాఁపికొనఁజాలక, తనకోపాగ్నినుండి వెడలిన శిఖాజ్వాలవలెఁ గన్పట్టుచున్న పిశంగవర్ణవిరాజితమగు తనజటను గరంబున నూడఁబెఱికి ప్రజ్వలితాగ్నియందు సమంత్రకంబుగ హోమము చేసెను. అప్పు డయ్యగ్నికుండమునుండి తినకోడలికంటె రూపవతి యగు నొకయువతి బయలువెడలెను. ఆహా! తపోవీర్య మెంతయుఁ జాలదు? అంతటనైన నతనికోప ముపశమింపలేదు. మరల నింకొకజట నూడఁబెఱికియగ్నియందు వేల్చెను, వికటదంష్ట్రాకరాళంబైన ముఖంబుతో శూలధారియై యొకదానవుండు వెడలి వచ్చెను. ఆయగ్నినుండి వెడలిన యయ్యిరువురును ముకుళితహస్తులై మునివర్యునకు నమస్కరించి, "అయ్యా! ఏమనివడి మమ్ము రావించితిరి. సెలవైనచో నాకార్య మమోఘముగ నొనర్పఁగలము." అని నిలువఁబడిరి.

అవినీతుఁడై కామోద్రిక్తుఁడై కన్నుగానని

క్రీతుని రూపుమాపుఁడని యుత్తరు వొసంగెను. వా రాత పోధనుని యాజ్ఞతి శిరసావహించి యాతని వెన్నంటి పోయిరి.

— దానవులు అవక్రీతునిఁ బైకొనుట —

వారిలో నాయువతి కామాతిరేకంబునఁ గన్నుగానక చపలచిత్తుఁడై పడియున్న యాయవక్రీతుని సమీపించి, యతని కమండలువు తీసికొనిపోయెను. అతఁ డెంతతపశ్శాలి యైనను జిహ్వమునకు వశ్యుఁడై యది యాడించినయట్లెల్ల నాడుచుండు టచేఁ దపశ్శక్తి యంతయు దగ్ధమైపోయినది. అంతియగాక, గర్వమతిశయించి దుర్వారదుఃఖపతితునిఁ గావించినది. కమండలువును గొంతామణి గొంపోవుటచే నాతఁ డపాత్రుఁ డయ్యెను. అంత నాతని శుద్ధాపాత్రుఁ డని తలంచి యా పిశితాశి యతనిని వెంటాడించెను. అవక్రీతుఁడు మిగులఁ గంపితుఁడై వెఱ్ఱివానివలెఁ బరుగిడ నారంభించెను. అతఁ డెచ్చటి కేగిన నచ్చటికే యారక్కసి పోవుచుండెను. జలంబులఁ జొచ్చిన నాజలాశయ మింకిపోయెను. మఱియెచ్చటి కేగిన రక్షణం బొందజాల నని నిశ్చయించుకొని తనజనకుని యగ్నిహోత్రి కుండంబునఁ బ్రవేశించెను. అంత నారక్కసుం డాతనిఁ బట్టుకొని శూలాయుధంబునఁ బొడిచి యాసురమునఁ జంపి యాం దానవియుఁ దానును రైభ్యునికడకుఁ జని నమస్కరించి "అయ్యా! మీరు పంచినకార్యంబు ముగించితి" మని నిలు

వఁబడియున్న యతని కాకృత్తి యను దానవిని భార్యగా నొ.
సంగి మీాయిచ్చవచ్చిన తెఱంగునఁ బోవచ్చు నని రైభ్యుఁడు
ముదల యొసంగెను.

—♦ భరద్వాజుఁడు నిజాశ్రమంబునకు వచ్చుట. ♦—

భరద్వాజుఁడు వనంబునకుఁ జని వచ్చునప్పటి కతని
కెప్పుడు నగ్నులు ప్రత్యుత్థానంబు సేయుచుండెడివి. అట్టి
వైశ్వానరుఁ డీదినంబున నడఁగియుండుటను జూచి యాశ్చర్య
నిమగ్నమానసుండై భయశోకంబులు పైకొన నాగృహపాల
కుం డగు శూద్రునివలన నయ్యదంతం బంతయు సాంతం
బుగ నెఱింగి మృతుఁడై పడియున్న పుత్రునిఁ జూచి శోక
పరీతహృదయుఁడై "తండ్రీ! రైభ్యుఁ డతికోపనుఁడు, ఆతని
యాశ్రమంబునకుఁ బోవలదు." అని యెన్నివిధంబులనో
బోధించితిని. నాబోధన లన్నియుఁ బెడచెవులఁ బెట్టి వలదన్న
పనిఁ జేసితివి. ఎందఱెందఱకో నాహితోపదేశము పథ్యంబుగ
నుండెడిది. పెరటిచెట్టు మందునకుఁ బనికిరా దన్నట్లు నాహి
తోపదేశములు నీకు విరసము లయ్యెను. అయ్యయ్యో!
పుత్త్రకా! గర్వ మెట్టిపామువేళ నిన్నాశ్రయించినదో కాని
నీమరణము చూచువఱకు నిన్ను విడువలేదుగద! నీ వెంత
తపోనిష్ఠాగరిష్ఠుఁడవైనను నీయందున్న గర్వంబు గరళము
కంటె నెక్కుడు తీవ్రమై నీప్రాణంబుల నపహరించినది. ఎన్ని

సద్గుణము లున్ననేమి ? ఒక్కచెడుగుణముండుటవలన హాని వాటిల్లకమానదు. పక్వాన్నంబు లెంతరుచ్యంబులైనవైనను, ఒక్కవిషబిందువు సోఁకినచోఁ గలుషితములు గాకుండునా ? సారజలపూరితఘటంబునం దొకరంధ్రముండిన నాజలంబులు క్రమక్రమంబుగ నేలపాలగుచుగదా ? అని యనేకవిధంబులఁ బనవిపనవి విలపించి యతని కగ్నిసంస్కారక్రియలు గావించి పుత్త్రమరణదుఃఖంబు సహింపఁజాలక తానును దేహత్యాగంబుసేసె నని రోమశుఁడు చెప్పిన ధర్మరాజకథాంశమంతయు విని గరువం బెట్టిగుణవంతులనైనను నాశము గావించు నని పల్కెను. అనంతరము రోమశుం డుదంకునిచరిత్రము నిట్లు చెప్పెను.

# ఉదంకుఁడు

బ్రహ్మతేజోవిరాజితుండును దపోనియమవ్రతజలసేచనంబునఁ గడుగఁబడిన పాపపంకంబు గలవాఁడును నిర్మలమును, సుధారమును నగు చిత్తము గలవాఁడును నగు నుదంకుఁడను సన్మునీంద్రుండు గురుకులమునందుఁ జేరి గురుజనసేవనంబున గురుదేవుననుగ్రహంబు వడసి జ్ఞానధనంబును సముపార్జించెను.

ఆయుదంకుఁడు పైలమహర్షిశిష్యుఁడు. గురుహితకార్యధురంధరుఁడు, పౌష్యమహారాజభార్య చెవులఁ దాల్చు కుండలంబులం గొని వచ్చి తనకిమ్మని యతనిగురుపత్ని నియోగించెను. ఆమెయనుమతి వడసి వనమధ్యంబునఁ బడి పోవుచుండ నొక్కమహోక్షంబు నెక్కి వచ్చుచుండు నొకమహాపురుషునిఁ గని యతఁడుచెప్పినచొప్పున గోమయభక్షణంబు గావించి యమ్మహాత్మునను గ్రహంబు వడసి యతివేగంబునఁ బౌష్యుని మందిరంబునకుఁ జనియెను. ఆతపోధనునిరాకఁ గాంచి పౌష్యుం డెదురై యర్ఘ్యపాద్యాదివిధుల నర్చించి యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి కుశలం బడిగి "స్వామీ! మీ రేకతంబున నిందులకు వచ్చితిరో వినఁగోరుచున్నాను." అని యడిగెను.

—• ఉదంకుఁడు పౌష్యుని కుండలంబు లడుగుట. •—

అప్పుడు ఉదంకుఁడు "మహారాజా! నేను పైలమహర్షి శిష్యుండను. గురుకార్యనిర్వహణంబునకై వచ్చితిని. మాగురుపత్ని మీ దేవికుండలంబుల ధరింప వేడుకపడి, వానిఁ గొనితేరనన్ను మీ యొద్ద కంపిన" దని యతనితోఁ జెప్పెను. అంతటఁ బౌష్యుఁడు "నేటికిఁగదా నాజన్మము సఫలమైనది? సాధనంబిట్టిమహాత్మున కిచ్చుధన్యత నేటికిఁగదా లభించినది! సత్పాత్రమునం దిడఁబడిన దానము కొలఁదియైనను కోటిగుణితమై విరాజిల్లు చుండు" నని తలంచి యుదంకునిఁ జూచి "అయ్యా! మీరు నాజీవితమును చరితార్థముఁ గావింప వచ్చిన మహనీయులు. మీపూన్కి సఫలముసేయుటకు సంసిద్ధుఁడనై యున్నాను. నాధర్మపత్ని యాకుండలంబులు ధరించుసమయ మైనది. అవి యామె ధరింపక మున్నే మీ రామెయొద్దకేఁ జని కుండలంబుల మీ కిమ్మని నేఁ జెప్పితి నని యామెతోఁ దెల్పి వానిని బుచ్చికొనుఁ" డని పంపెను. అంతట నాయుదంకుఁడు రాజునొద్ద సెలవుగైకొని యమ్మహాదేవి యున్న యంతిపురంబునకుఁ జనియెను. కాని యం దెవ్వరుఁ గానరాలేదు. ఇందుల కేదైయేని కారణ ముండకపో దని యోజించి మరలఁ బౌష్యుని యొద్దకు వచ్చి "అయ్యా! నీదేవి యంతఃపురమున నెంత వెదకినను గానరాలేదు. వెదకి వేసారి యొంటను గానక నీ కడకు వచ్చితిని. నన్నేల యిట్టిచిక్కులఁ బెట్టెదవు? నీవే

యా మణికుండలంబులఁ దెచ్చి నా కిచ్చితి వేని గొనిపోయెదను. ఇప్పు డిచ్చుట నసఁడ్డఁ జేసిన నా ప్రయత్న మంతయు విఫలం బగు" నని చెప్పెను. ఆమాటలకుఁ బౌష్యుఁడు నవ్వుచు నీవు మిగులఁ బవిత్రుఁడవు. నీవు మెట్టిన భూములు పవిత్రతనుం బులు. నాదేవి మిగుల సుగుణశీల, పవిత్రపతివ్రత గావున నామె యపవిత్రులకు గోచరింపదు. నిం మ్మపవిత్రు లని యె ట్లనఁగలను ? కారణ మెద్దియో నాకును బోధపడుట లేదు" అనియెను. ఆమాటల కుదంకుఁడు నివ్వెఱపడుచు "నాయపవి త్రతకు వృషభగోమయభక్షణమే కారణము కాకున్న, మఱి యేమున్నది? అందువలననే యాపరమపతివ్రత నాదృష్టికి గోచరింప కున్నది" యని తలంచి పవిత్రజలంబులచేఁ గాలుసేతులఁ గడుగుకొని తూర్పు మొగముగఁ గూరుచుండి యాచమించి పౌష్యునియనుమతి ననుసరించి మరల నద్దేవి యొద్దకుఁ జన నామెయును నమ్మహాత్మునికి నమస్కరించి, భర్తయనుమతిని బూదండవోలె శిరంబున ధరియించి యయ్యు దంకుని విధివిధానంబునఁ బూజించి, తనకు సౌభాగ్యకరంబు లలంకారంబు లని యైనఁ దలఁపక యాకుండలంబుల నవ్విప్ర శిఖామణి కొసంగెను.

స్త్రీల కాభరణంబు లనిన నెంతయో ప్రీతి. అందు కర్ణాభరణంబులు సౌభాగ్యప్రదంబు లగుటచే మిగులఁ బ్రియ తమంబులు. అయినను, భర్తగారియనుమతి యొక వైపునను

బాత్రోచితమగు దాన మొకవంకను నామెను బ్రేరేపించు టచే నామె యెట్లును వెనుదీయఁజాలకపోయెను. గుణాఢ్యు తుల కీర్తిచంద్రిక లాచంద్రతారకముగఁ దేజరిల్లుటకే యిట్టి యమోఘసంకల్పములు లోకంబున సువ్యక్తము లగుచుం డును. అప్పుడు పౌష్యునియిల్లాలు తనరత్నకుండలంబులు తా నసస్తమున కీశ్వరార్పణం బని యొసంగి యాతపసి పోవునెడ నొక్కమాటమాత్రము చెప్పెను. అది యేమన—అసమాన తేజోనిధి వగు నోమునిసత్తమా! మాయావియును జయింప శక్యముకానివాఁడును, దురాత్ముఁడు నగు తక్షకుఁ డీకుండ లంబుల హరింపవలె నని కాచుకొనియున్నవాఁడు. వాని బారిఁ బడకుండ సురక్షితముగ నీనిఁ గొని చని మాగురుపత్ని కొసంగుము మని యతని కొసంగెను.

—• ఉదంకుఁడు పౌష్యుని శపియించుట •—

అప్పు డుదంకుఁ డామెమాటలకు వల్లె యని యామె కడ సెలవుగైకొని మరల పౌష్యునిసెలవు వేఁడుటకై వచ్చెను. అప్పుడు పౌష్యుఁడు « అయ్యా! నీవతిథివై మాయింటికివచ్చి తివి. మాయింట భుజించి పొ"మ్మని వేఁడుకొనిన నుదంకుం డంపుల కొడంబడి భోజనముసేయుచుండ నాయన్నంబునఁ దల వెండ్రుక గానవచ్చెను. అందుల కాతపసి యేవగించుకొని మిగులఁ గోపించి పరీక్షితంబుగాని యశుచి యగు నన్నంబును

మాకుఁ బెట్టించితివి కావున నీవు గ్రుడ్డివాఁడవై యను మని శాపం బిచ్చెను. అంతట నాతనిచేఁ దిట్టుబడి పౌష్యుఁ డూరకుండలేఁడు. ప్రతిశాపం బిచ్చుటకుఁ దగిన శక్తి గల యతఁ డేల యూరకుండును ? కొలఁదిపాటిదోషంబునకు సహింపక శాపం బిచ్చితి వని కోపోద్దీపితుఁడై నీవు సంతానహీనుఁడ వగు మని ప్రతిశాపం బిచ్చెను. పాప మాయిరువురును జిరకాలోపార్జితం బైన తపోధనమును కోపాగ్ని కాహుతిగా నొసంగవలసివచ్చెను. సంతానము లేనివాఁడు జీవించియు నిష్ఫలమే కావున నాశాపమును మరల్పు మని యుదంకుఁడు పౌష్యు నడిగెను. అప్పుడు పౌష్యుఁడు "తాపసోత్తమా ! విప్రులచిత్తము లతికోమలములు. శాంతినిధానములు. కాని, వారి పల్కు లతిదారుణములు. వజ్రసారముకంటె కఠినములు. రాజులయెడ నవి విపరీతస్థితి నొందియున్నవి గావున శాపంబుఁ గ్రమ్మరించుశక్తి బ్రాహ్మణునియందు గలదు. క్షత్రియుఁ డెంత శాంతచిత్తుఁడైనను శాపంబుఁ గ్రమ్మరింపఁజాలఁడు. విప్రునకు దానప్రతిగ్రహంబులందును, అధ్యయన అధ్యాపకత్వములందును, యజనయాజనాదికర్మలయందు నెట్టిస్వాతంత్ర్యము గలదో శాపమోక్షణంబులయందుఁగూడ నట్టిశక్తి యున్నది. క్షత్రియున కీకర్మములఁ గావించుటకే కాని వేఱొండు స్వాతంత్ర్యము లేదు. అట్లే శాపమిచ్చుటకే కాని, మరలించు శక్తి మాజాతికి లేదు. కావున నీవు నాకొసంగిన శాపంబును మరలింపు మని యడిగెను.

అందులకువల్లె యని యుదంకుఁడు కొలఁదికాలములో నసే నీకు శాపమోక్షణంబు కాఁగల దని చెప్పి గురుకార్యము నిర్విఘ్నముగ నెఱవేర్చి గురుపత్ని కొసంగుటకుఁ గుండలం బులు తేఁగంటి నని యానందనిమగ్నమానసుఁడై పోవుచు మధ్యేమార్గంబున నిర్మలజలభరితంబగు నొకజలాశయంబుఁ జూచి జలపానార్థమై యందుఁ బ్రవేశింపనెంచి పరిశుద్ధప్రదే శంబున నాకుండలంబుల నిడి యాసరోవరసమీపంబునకుఁ జనియెను.

## —♦ తక్షకుఁడు కుండలంబుల హరించుట. ♦—

తక్షకుఁడు వస్త్రహీనుఁడై యాతని వెన్నంటివచ్చి యం దిడినకుండలంబులఁ గైకొని పాఱిపోయెను. ఉదంకుఁడు ను, నతనివెనుకొని చని కొంతదడవు పరువిడి పట్టుకొని యెను. అంత నావిషధరుఁడు చేయునది లేక, దిగంబరత్వ మును విడిచెను గాని కుండలములుమాత్రము విడువక నిజ రూపమును బొంది భూవివరమునఁ బ్రవేశించి యురగలోకంబు నకుఁ జనియెను. ఉదంకుఁడు మించినదానికి వగచినఁ బనిలే దని నిశ్చయించుకొని గాలికంటె వేగంబుగ నాతనితోడన నా గలోకంబునకుఁ జని, నాగకులంబు నెల్లస్తుతించెను. విశాలము లగు వనములతోడను, వృక్షపంక్తులతోడను, సప్తసముద్రము లతోడను, కులగిరులతోడను, సరస్వత్యాదిమహానదులతోడను

గూడియున్న యీమహామహీభారమును నిరంతరజాగరూకతా
చణుఁడై వేయిపడగలతో మోచుటయే కాక, పరస్పరస్పర్థ
లేకుండ భువనంబులఁ దనగర్భంబున నిముడ్చుకొనియున్న
మహావిష్ణునికి శయ్యయైన యీశేషమూర్తి, దేవతలవలన బా
ధలు పొందకుండ తపశ్శక్తిచే నురగకులంబును రక్షించి సురా
సురమకుటమణివిరాజితపాదకమలుండగు మహేశునకు భూష
ణంబై విరాజిల్లు ఫణిరాజు నాకుఁ బ్రసన్నుండు గావలయు
నని యనేకవిధంబులఁ గొనియాడి యచ్చటఁ దెలుపునలుపు
వర్ణముల ననువయించు నిరువురు స్త్రీలను ద్వాదశారచక్రం
బును ద్రిప్పుచున్న యాఱుగురుకుమారులను మిగుల నున్నతతు
రంగంబుపై నెక్కిన మహాతేజస్సంపన్నుం డగు నొక్క దివ్య
పురుషునిఁ గని యర్థవంతంబు లగు మంత్రంబుల నతిభక్తియు
క్తంబుగ స్తుతియించిన ప్రసన్నుఁడై యాదివ్యపురుషుం డుదం
కునితో, “ మానివర్యా! సుప్రసిద్ధయశోధురంధరా! నీయ
థార్థస్తుతులకు నేను సంతసించితిని, నీ కెయ్యది వాంఛితంబో
దానిని వేఁడుము, తప్పక యొసంగువాఁడ ” ననిన, నుదంకుం
డానందనిమగ్నమానసుండై యీయురగసముదాయము నాకు
వశమగుట కనుగ్రహింపవలయు నని యడిగెను. అంత దయా
మయుఁ డగు నాదివ్యపురుషుఁ డుదంకు నయ్యశ్వకర్ణరంధ్రంబు
నూఁదు మన నతఁ డతనివచనానుసారంబుగఁ జేయ, వెంటనే
యాయశ్వకర్ణమునుండి ప్రళయకాలోదితజ్వాలామాలికవలెఁ బా

తాళం బెల్ల నగ్నిజ్వాలలు వ్యాపింప నురగలోకం బెల్ల వెఱఁ
గంది హాహాకారంబులు మిన్నుముట్టఁ దల్లడపడుచు నిది యీ
శ్వరసన్నిభుం డగు బ్రాహ్మణునికోపాగ్ని యేమో యని
భయంపడుచుండఁ దక్షకుండు తిక్తగంబ యక్కుండలంబులఁ
గొనివచ్చి యుదంకున కొసంగి చనియెను. నాగకులంబు నెల్లఁ
గలగుండుగావించి తక్షకునిచేఁ గుండలంబులు వడసి యుదం
కుఁడు తనలో "నాలవనాఁటికిఁ గుండలంబులఁ ద్వరితంబునఁ
గొని రమ్మని మాగురుపత్ని నన్నంపినది. ఇదియ కుండలం
బులు ధరించు పవిత్రదివసము. ఈదివస మతిక్రమించెనేని నా
పడినశ్రమ మంతయు బూడిదయఁ బోసిన పన్నీటిచంద మగును.
ఈదివస మతిక్రమింపకుండఁ బోవుట యెట్లు సంభవించును.
ఈనాగభువనము కడచు టెట్లు ?" అని విచారవిమగ్నుఁడై
యున్న యుదంకున కామహాపురుషుఁడు సాక్షాత్కరించి,
"ఉదంకా! నీకొక్క యుపాయంబుఁ జెప్పెద నాలింపు
ము. ఈగుఱ్ఱము మనంబుకంటె వేగముగ నరుగునది. దీని
నధిష్ఠించి పోయితి వేని సమయాతిక్రమణము గాకుండఁ జేరఁ
గలవు." అని చెప్పిన నుదంకుఁ డశ్వారోహియై గురునిగృ
హంబునకు వచ్చునప్పటికి గురుపత్ని స్నానము గావించినూతన
వస్త్రధారిణియై కురులు క్రొమ్ముడి వైచికొని కుంకుమబొట్టు
ధరించి భక్తిభావంబున నేకాగ్రచిత్తయై కుండలంబులు ధరించు
సమయం బాసన్నమగుడు నుదంకునిరాకకు నెదురుచూచు

చుండెను. అంతలో నుదంకుఁడు సప్రమోదముతో వచ్చి గురుపత్నికి భక్తిపూర్వకప్రణామంబు గావించి తాఁ గొనివచ్చిన కుండలంబుల నామెచేత నిడియెను. కుండలంబులు చూచినంతనే గురుపత్ని శిష్యుని యమోఘకార్యదీక్షకు సంతసించి యాకర్ణాభరణంబుల ధరియించి బ్రాహ్మణులఁ బూజించి నిజసంకల్పసిద్ధికి నుత్సవంబు గావించెను. గురుకార్యదీక్షాపరుఁడగు నుదంకునిఁ జూచి గురువర్యుండు సంతోషంబునఁ "కుమారా! ఈసమీపంబున నున్న పౌష్యనగరంబునకుఁ జని యింత యాలసించితి వేల?" అని యడిగెను. ఉదంకుఁడును, "అయ్యా! మీ రానతిచ్చిన ట్లాఁసింపఁదగినది కాదు. తక్షకుం డను దురాత్ముండు గావించిన విఘ్నంబులవలన నింత దడ వైనది. మిమ్ముఁ బాసి వనమధ్యమునుండి పోవుచుండ నెకర నొకయున్నతవృషభంబు నధిష్ఠించిన యొకమహాపురుషుం డెదురయ్యెను. ఆతని దర్శించి నమస్కరించితిని. అతఁడు నన్ను వృషభగోమయంబు భక్షింపు మని యానతిచ్చిన నట్లు చేసి చని పౌష్యమహాదేవికుండలంబులు గొనివచ్చుచుండ దురాత్ముఁ డగు తక్షకుఁ డాకుండలంబుల హరించెను. వాని వెనువెంటఁ బాతాళలోకంబునకుఁ జని నాగపతుల నెల్ల వినుతించి వారియనుగ్రహంబు వడసితిని. నే విన్నవించు నది విని యందలిసత్యము సెలవిండు—నలుపు తెలుపు రంగులు గల వస్త్రము నిరువురుస్త్రీలు నేయుచుండిరి. పది రెండంచులుగల చక్రమునందు ఆర్వురుకుమారులు పరివర్తిం

చుటయును మిగుల నునత మగుతురగము నధిష్ఠించిన యొకదివ్యపురుషునిఁ జూచితిని. అతనియనుగ్రహంబునఁ గుండలంబులఁ బొందినయతనియాదేశంబున నే యాతురగంబు నెక్కి తమసన్నిధికి వచ్చితిని. ఇందలియర్థంబు నాకు వివరింపుఁ డని యెను. అందులకు గురుఁడు, చిఱునవ్వు నవ్వి "పుత్రికా! నీపుణ్యవిశేషంబున దివ్యరహస్యంబుల నెఱుంగఁగలిగితివి. ఆ పురుషుం డిందుఁడు. ఆతఁ డధిరోహించునశ్వ మైరావతము. నీవు భుజించిన గోమయ మమృతము, నాగలోకంబునఁ గనుఁగొన్న యిరుపురుకాంతలును ధాతృవిధాతలు. వారు నేయుచున్న సితాసితతంతురాజి యహోరాత్రంబులు. పది రెండంచులు గలచక్రము మాసములతోఁ గూడిన సంవత్సరము. కుమారు లని చెప్పియుంటివే, వా రాఱ్వురును ఋతువులు. ఆతురగ మగ్నిదేవుఁడు. ఆతురగాధిరూఢుం డగు పురుషుం డిందుసఖుం డగు పర్జన్యుండు. తొలుదొల్తఁ బురుహూతుదర్శనంబు సేసితివి గావున నీయభీష్టసిద్ధిఁ బొందగలిగితివి. నీయమోఘప్రయత్నంబువలన మాయభిమతంబులు నెఱవేఱినవి." అని శిష్యుని బుజ్జగించెను. పిమ్మట పైలమహర్షి, కష్టంబులకు సహించి గురుకార్యమునందు దీక్ష వహించి నెఱవేర్చిన సత్పురుషులకుఁ బుణ్యఫలంబులు సిద్ధించుటకు సందియంబు లేదు. నీసాహసంబునకు మెచ్చితిని. గురుకార్యంబునుండి ఋణవిముక్తుండ వైతివి. ఇఁక నీయిచ్చవచ్చినచోఁ బొమ్ము". అనెను. ఉదంకుండును దపంబున కరిగెను.

# గరుత్మంతుఁడు

కశ్యపప్రజాపతికిఁ గద్రువ, వినత యను నిరువురు భార్యలు గలరు. అందు కద్రువకు నాగులును, వినతకు గరుత్మంతుఁడును పుత్త్రులై యుండిరి. వారిలో వినత కద్రువకుఁ గారణాంతరమున దాసియై యామె యాజ్ఞాపించినపను లెల్లఁ జేయుచుండెను. గరుత్మంతుఁడును నామెకు దాసుఁడై సేవ చేయుచుండెను. అంతట నొకనాఁడు కద్రువ వైనతేయుం గాంచి యిట్లనియెను. "ఓయీ! నీ వెప్పటికేగితివి. నీయిచ్చవచ్చినట్లు తిరిగివచ్చుచున్న నింటిపను లెవ్వరు చూతు రనుకొంటివి. ఒకచిన్నమాటాడిన మీయమ్మ మొగమిట్టే పెట్టుకొనియూరకుండును. నీవన్ననో రెక్క లాడ్చుకొనుచు నిచ్చవచ్చినట్లు తిరిగి తిరిగి వత్తువు. నేను జూడ నొంటిదానను. ఈబిడ్డల నోదార్చుకొనుట యెట్లు? నాయనా! వీరి నెత్తుకొని కొంచె మాడించుకొనిరమ్ము. నే నింటిపనులఁ దీర్చికొందును. అంతవఱకు వీని నెత్తికొనుము. నే నేది చెప్పిన నది వినక నీయిచ్చవచ్చినట్లు లాగడముగఁ దిరుగుచుంటి వెప్పటికట్లు సేయకుము. నాపనిచిన యది యెల్ల విసువక సేయుటయే నీపని. ఇప్పటికీబిడ్డల నాడింపుము. వెనుకఁ జూచుకొందము." అని చెప్పెను. అంత నా గరుడుఁడు కద్రువ పని

చినపను లెల్ల వినతయనుమతి ననుసరించి చేయుచుఁ బినతల్లి బిడ్డలను దనవీపుపై నెక్కించుకొని తనయిచ్ఛవచ్చిన ట్లెల్లఁ దిరుగుచు నగరములు, నగములు, ద్వీపములు, నదులు, జలాశయములు, ఇదియది యననేల, సకలదిక్పాలపురంబులు, వారికిఁ జూపుచుండెడు వాఁడు. కద్రూనందను లన్ననో యతనిమూపునఁ గూర్చుండి దైవము మాకెట్టిభృత్యులను బ్రసాదించినాఁడు! అనుకొని అలపుసొలపు లేక వీపుపై నట్టే నిద్రపోవుచుండఁగనే సకలదిక్కులు చూడఁగలిగి యానందించిరి. ఒకదినంబున నట్లే తనసాపత్నిసోదరులను మూపుపై నెక్కించుకొని యామహాబలుఁ డగు ఖగేంద్రుఁడు జివ్వున నాకసంబున కెగసెను. పిమ్మట వాతఁడు సప్తమారుతపథంబునకుఁ బోయెను.

అచ్చటనే యినమండలంబుగూడ నున్నది. చండభానుసహస్రకిరణంబుల వాఁడిమికిఁ బోఁడిమి చెడి యాశోణితాంబులు పుడమింబడి మూర్ఛపోయెను. ఒక్కబిడ్డ మరణించినప్పుడే తల్లి కపారమగు శోకము కలుగును. ఇప్పు డన్ననో బిడ్డలందఱు నొక్కసారి పుడమిఁ బడియుండుటను జూచిన నాతల్లికడు పెంతచుమ్మలు చుట్టుకొనిపోవునో యెవ్వరికెఱుక? అంత కద్రువ కుపితయై గరుడునిఁ దనయిచ్ఛవచ్చినట్లెల్ల నిష్ఠురోక్తు లాడెను.

—• కద్రువ ఇంద్రుని వేఁడుకొనుట •—

కద్రువ-ఓపాకశాసనా! నీసుశీతలకరుణాతిరేకంబుననే దేవతలు, మనుజులు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, మున్నగు

త్రిలోకవాసులు బ్రతుకఁగలిగిరి. అకుంఠితపరాక్రమసంపన్నుండవగు నీవజ్రాయుధంబు మునిలోకంబునకు శాంతి నొసంగఁగలిగెను. పుత్రశోకపరీభూతనై నేను నిన్ను శరణువేఁడుచున్నాను. ఆపన్నులయార్తి వారించు దయాళుండవు. "పురందరా! 'అపుత్రస్య గతి ర్నాస్తి' యను వార్తయే నీ వెఱుంగనిది కాదు. పుత్రహీనయోగాలింపలేకవంకను, సంతతికొఱకుచేసైన యవమానం బొకయెడను గాల్చివేయుచుండ నే నెట్లు మనఁగలను? కడుంగడు దీననై వేఁడుచున్న యీనామొఱ నాలించి నాకు శరణంబవగుము. దయామయా!" యనిన నామెదీనాలాపంబుల కయ్యింద్రుండు పర్జన్యునిం బ్రేరేపింప నాతఁడు కుంభవృష్టిఁ గురియింప నాచల్లఁదనంబువలన నురగు లెల్లఁ బునర్జీవితులైరి. అంతఁగద్రువ వెనుకటికంటె నెక్కుడు గర్వాతిశయంబు గలిగి గరుడునిచేతఁ బనులఁ గొనుచు వారిని సేవలపరిచారకులుగఁ గాంచుచు పరివారలలో నీచాతినీచముగ మాటలాడుచుండెను.

తన్నుం బంచినపను లెంతశ్రద్ధతోఁ జేసిన నేదియేని యొక్కనెపంబుఁ బన్ని యాపనులయం దేమేమో దోషములఁ గల్పించి రోషమువచ్చు మాటలతో నీసడించివైచుచుండెడిది. కొన్నిదినంబు లీవిధంబుగ జరిగిపోయినవి.

అంత నొకదినంబునఁ గరుడుండు తల్లియొద్దకు వచ్చి నమస్కరించి, అమ్మా! ఈదాస్యము మన కెన్నఁడు విముక్తి

యగును ?. మన మెన్నఁడు సుఖింతుము? నేనంతమన సెంతింగి మసలుకొన్నను మనపిన్నమ్మ నన్ను గారవింపదు—పోనిమ్ము, గారవింపకున్న నేమి ? కాఱులాడకున్నఁ జాలును. ఇంతటి బలవంతుఁడ వయ్యు శౌర్యసాహసములఁ జంపికొని దాసాను దాసుఁడనై యుంటిని. తేరవాసికంటె హైన్యమును బొందుచుఁ జిత్తము చిత్త మని చేతులు నలుపుకొనుచు నెన్నిదినంబులీసాపత్నీదాస్యము సేయ నోడఁబడితివి ? ఈదాస్య మెందుల కేర్పడినది. ఈబన్న మెవ్వరు వాపెదరు ? అమ్మా ! నాకేమిగాని, నీబాధ, నీయవమానము, నీనైచ్యము, దలంచుకొనిన నాకడుపు చెక్కలైపోవుచున్నది. నాతెక్కబలం బంతయుఁ గద్రూనందనులను మోయుటకును, నాజ్ఞాన మంతయుఁ బిన్నమ్మమనసు నొవ్వకుండ సేవసేయుటకేనా ?

అమ్మా ! నీకేమి పిచ్చిపట్టినదా యేమి ? ఊరక యెల్లల తెల్లపోయిచూచెదవు. ఈదాస్యము మన కేల గలిగినదో చెప్పుము. తలవంచుకొని యూరకుండిన నేమిలాభము ? ఇదివఱ కెన్నిసారులో యిట్లే కడపివేసితిని. ఇక్కడైనను చెప్పక తప్ప దని బలవంతపెట్టుచున్న కుమారుఁ జేరదీసి, కౌఁగిలించుకొని, శిరంబుమూర్కొని, గుప్పునకుఁ గుంచెడుగ నేడ్చుచు వినత యాతని కిట్లనియె.

“ నాయనా ! ఒకనాఁటిసంజకతి నేను సపత్నీసహితనై యుద్యానరామణీయకంబులఁ జూచువేడుకతో నచ్చుటికిఁ

బోయితిమి. చందన మందార పారిజాత ప్రఫుల్ల మల్లీలతా వితానపరిశోభితమై, శుక పిక పారావత మత్తమధుకర నికర నినాదితమై, దరవికసిత కల్హార పరాగ పరిమళ విరాజితమై, మందమందగతిఁ బఱతెంచు దక్షిణానిలచాలనమై, యలరారు నట్టి యావనంబున విహరించుచుంటిమి. దాని కెదుర నుత్తుంగ తరంగాయమానమై ఫణీంద్రఫణారత్న ప్రభాభాసితమై, ఉదక నివాసవ్రతశీల మానిజనంబులకు సౌఖ్య మాపాదించుటకో యన బడబాగ్నిశిఖాసముదాయమై యలరు మహోదధి కలదు. తత్తీరంబున, ఫేనపుంజంబు నానొప్పారు నొక యశ్వరాజ మును మనకగ్రువ చూచినది. చూచినతోడనే మించిపోవు చున్నట్లు పరుగుపరుగున నామె నాయొద్దకు వచ్చి ‹అక్కా! సంపూర్ణచంద్రమండలమునందలి నల్లువలె నొప్పారునా శ్వేత తురంగపుచ్ఛమును చూడుము. ” అనియెను.

ఆమెమాటలకు నే నచ్చెరువడి, ‹ మనయెదుటఁ గా న్పించుచున్న యీయుత్తమాశ్వపుచ్ఛము నలుపుగా నున్న దని కలకంటివా యేమి? లేక నీకు భ్రాంతికలిగినదా ? నీ కట్లు కనఁబడుచుండె నేమో గాని మహాపురుషునికీర్తివలె శ్వేతకాంత్యుజ్వలిత మగు నీమహాశ్వంబునందు నల్పు వెదకి పట్టుకొంద మన్నను గానంబడుట లేదు. నీ వేకన్నులతోఁ జూచియుంటివి? అచ్ఛమగునాయశ్వపుచ్ఛమున నల్పు మచ్చు నకైన నొకక టని నే నంటిని.” అంత గరుత్మంతుఁడు‹అమ్మా!

పిమ్మట నేమి జరిగినదో దెల్పుము. ఊరకుండకుము.' అనియెను.

అప్పుడు వినత, యిట్లనియెను. పిమ్మట నేమిజరిగినది? ఏమి జరుగవలయునో అదియే జరిగినది. ఆయుత్తమతురంగ దేహంబునందు నల్పు కలిగిన నీవు నాకు దాసివగుము, నల్పు లేకుండెనేని నేను నీకు దాసి నగుదు నని పందెము వైచిన దామె. అప్పుడె నే నాయశ్వమును సమీపించి చూతము రమ్మనఁగ గ్రుడువ యిప్పుడు ప్రొద్దు గ్రుంకినది. మన మిచ్చట సన్నిదము లాడుచున్న పతిపరిచర్యాసమయ మతిక్రమింపఁగ లదు. ఇప్పటి కింటికిఁ బోయి రేపు మరల వత్త మని తెల్పెను. అప్పటి కిరువురమును యథాస్థానమునకుఁ బోయితిమి——

—♦ అశ్వపుచ్ఛంబునకు జుట్టుకొమ్మని కద్రువకొడుకులఁ బ్రోత్సహించుట ♦—

మరునాఁడు తనకొడుకుల నందఱఁ జేరఁబిలిచి, నాయ నలారా! నేనును వినతయును నిన్నటిదినంబున నుద్యానవిలా సంబులఁ జూడఁబోయితిమి. అచ్చటి కనతిదూరంబునఁ గల సముద్రతీరంబున నొక శ్వేతాశ్వమును జూచితిమి. దానితోఁక నల్పని నేను వాదించితిని, 'కాదు, తెల్లగనే యున్న' దని యామె వాదించినది. 'అచ్ఛపుచ్ఛము నల్పయినయెడల నీవు నాకు దాస్యము సేయుము. తెల్లగనే యుండెనేని నేను నీకు దాసి నగుదు' నని యామెతోడఁ బందెము వైచితిని. ఇప్పుడు నేను వినతకు దాస్యము సేయవలయును. సమర్థులగు కొడు

కులు గల తల్లికి సాధ్యము కాని దేమున్నది? మీరు బుద్ధి
మంతులరు, సమర్థులరు, కామచారులను పొందఁజాలని యు
గ్రంబు లేదు. కావున, మీరందఱు నామాట చెల్లించి మా
త్ప్రాణము తీర్చికొని నన్నానందింపఁజేయుఁడు' అని తల్లి వారిని
బతిమాలుకొనుటవలన, మాఱుపలుకఁజాలక కొంతదడవు
వాదులాడుకొనిరి. తల్లికి నుపకృతికొఱకధర్మముఁ జేయఁజన
దనియును, స్త్రీలోకమున కెఱుకలేకున్నఁ బెద్దలతో స్వప
క్షమును సాధించుకోయత్నింతు రని వారు నిశ్చయించి యధ
ర్మారంభంబున కియ్యకొనరైరి.

అంత కద్రువ ఖిన్నముఖియై వారి ననేకవిధముల
బతిమాలుకొనినది. వారంతులకు సాయపడనియెడల రాఁబో
వు నికృష్టుల మరలఁమరలఁ దెల్పినది. ఏమైననేమి, ఇదియధర్మ
కార్య మని వారు నిషేధించిరి. సామోపాయములచే సాధిం
పఁజాలక పాప మామె కుపితయై జనమేజయసర్పయాగంబున
సర్పంబు లన్నియు దగ్ధ మగుఁగాక యని తీవ్రశాపం బొసం
గినది.

శాపానుభవభీతిచేఁ దక్షకుఁ డను సర్పరాజధర్మంబు
నకుఁ గడంగియైన జీవింపవలయు నని పెద్దయాసతో 'అమ్మా!
నీయభిమతమును నేను నెఱవేర్తును. రేపకడ లేచిపోయి
యాయశ్వపుచ్ఛంబునకుఁ జుట్టుకొనియెద నని తెల్పి, యధ
ర్మమైనను దల్లిపనుపు చెల్లించుటయే ధర్మ మని నిశ్చయించు

కొని శేపకడ లేచి యటకేగి యాయశ్వపుచ్ఛంబునకుం జుట్టు
కొనియెను.

ఆసాయంతనము విహారమునకై యెప్పటియట్లు మేమిరు
పురమును బోయితిమి. మరల నాయశ్వ మందే నిలువఁబడి
యుండెను. కొంతసేపటికి నావైపు మొగమై కద్రువ 'అక్కా!
ఇప్పుడైన నాయశ్వపుచ్ఛమును జక్కగఁ బరికింపుము' అని
వికటహాసముఁ జేసినది.

ఆసాయంతనము విహారమునకై యెప్పటియట్లు మేమిరు
పురమును బోయితిమి. మరల నాయశ్వ మందే నిలువఁబడి
యుండెను. కొంతసేపటికి నావైపు మొగమై కద్రువ 'అక్కా?
ఇప్పుడైన నాయశ్వపుచ్ఛమును జక్కగఁ బరికింపుము' అని
వికటహాసముఁ జేసినది.

తండ్రీ! నా తెలివి యింతలోఁ దెల్లవాఱిపోయినది.
ఆమె నవ్వినం దిమిడియున్న యాయర్థమును గ్రహింపఁజాల
నైతిని. నిశ్చయముగ, స్పష్టముగ నాయశ్వపుచ్ఛము నల్లనై
యుండుటను చూచి తెల్లపోయితిని. మఱి మాఱుమాటాడఁ
జాలనైతిని. ఒడలు కంపించినది. మతి చెదరిపోయినది. పద
ములు తొట్రుపడియెను. ఒడల ముచ్చెమటలు పట్టినవి. నోట
మాట రాలేదు. అప్పుడీహాస్యము నాతలపై పిడుగులవలెఁ
బడినవి. ఏమైన నేమి? నాయనా! నాతలవ్రాఁత యిట్లుండ
నెవ్వరు మార్పంపఁగలరు? అంత మేము పురము నింటికిఁ

చేరితిమి. అప్పటినుండియు నిది యది యనక యన్నివిధము లగు సేవలను నాచేత నామె గైకొనుచున్నది. ఇది యేమి యనువార లెవ్వరు లేరుగదా! తండ్రీ? యెంతపాపపుజీవనమో కాని యొక్కనాఁడైన సౌఖ్య మనునట్టిదియో యెఱుంగను పోనిమ్ము. నాగతి యెట్లైన నేమి? తండ్రీ! నీచురాల నగునాకడుపునం బుట్టినకతంబున నీకుఁగూడ నిదాస్యజీవనమే సమకూర్చవలెనా దైవము? జీవితాశ యధిక మగుటచే మొండికట్టెనై బ్రతుకుచుంటిని పుత్రా? నాతోడిసవతికి దాసినై నీచాతినీచ కార్యములు సేయసమకట్టి యభిమానధనంబు నంతయుఁ బాల్లుసేసికొని సిగ్గు లేక బ్రతికి తిరుగుచునని యందఱ నడుమ మసలుచుంటిని. నాపాపము నిన్నుఁగూడఁ జుట్టుకొనినదిగదా! బిడ్డా! కద్రూనందనుల నెత్తికొని దేశములవెంటఁ దిరుగునీచదశ నామూలముననేకదా నీకుఁ గలిగినది? నాయుట్టిపాపభాగిని యెంచను లేదు. బలపరాక్రమతేజోవిభాసితుండ వగు నీకీదాస్యవృత్తిఁ బోకార్చువా రెవ్వరు? మనమిరువురమును గడుంగడు నొదిగి 'ఊ!' అనినఁ దప్పో 'ఆ!' అనినఁ దప్పో యని వెఱచి వెఱచి యెన్నిదినము లీక్రమమున దాస్యము సేయవలయునో కదా! బిడ్డలు పూజ్యత నొందినఁ గాంచి యానందించు తల్లుల యదృష్టము కొనియాడఁదగినది. బలపౌరుషములు గలిగియుఁ బినతల్లిపనుపునఁ బనులెల్లఁ జేయుచుఁ గడుపుకూటి కాశించి పడియున్న నిన్నుఁ జూచినఁ

గడుపు చుమ్మలుచుట్టుకొనిపోవుట కబ్బుర మేమున్నది? ఏ నాఁటికైన నీదాస్యజీవనము వారించుకొను నుపాయంబు గల దేని యోజింపుము. బిడ్డలు బలపరాక్రమవంతు లగుటవలనఁ దల్లితండ్రులయిడుములు వాపుదు రని వినుచుందును. కృష్ణభగవానుఁడు జనించి దేవకీవసుదేవులఁ గారావిముక్తులఁ గావింపలేదా! మన మంతటివారము కాకపోయినను, నిడుమ లుడుపుటకుఁ దగుదువు గానఁ, గొడుకా! యీకద్రువదాస్యము మాన్పింపుము. దాస్యజీవనముకంటె గ్రుక్కెడుప్రాణ మెట్టులైన విడుచుట శ్రేయము." అనియెను.

అంత గరుత్మంతుఁ డిట్లు పలికెను.

"అమ్మా! నాయంతటి బలపరాక్రమోపేతుం డగు సుతుం బడసియును నీవు దుఃఖించుటఁ దలంచుకొనిన నాగుండె నీరైపోవుచున్నది. కడచినపనికి విచారించినఁ బ్రయోజనంబు లేదు. దాస్యవిముక్తికై యత్నించి నిన్ను మెప్పింపవలయునే కాని వట్టియాడంబర మెందులకు? నేను బోయి వచ్చెద. సెలవిమ్ము" అని తల్లికిఁ బ్రణమిల్లి పతంగవల్లభుండు పినతల్లిబిడ్డలఁ జేరంజేరి 'తమ్ములారా! మీ కేది కావలయు ననిన, నది దేవలోకంబుననైనఁ జని వారల జయించికొని వచ్చి మీ కిచ్చెద, మాయీదాస్యం బుడుపుం'డని వారి నడిగెను.

అంతఁ గాద్రవేయులు గరుడునిమాటల నాఁకొని కరుణాలురై అన్నా! నీవమితబలపరాక్రమవంతులలో నుత్తమో

త్తముఁడ వగు ఖేచరుఁడవు. నీవు పూనినకార్యంబు నెఱవేఱుట కసాధ్యంబు గలదే ? దాస్యంబు వాపుకొను నిచ్ఛ నీచిత్తంబునఁ బొడమెనేని నీభుజబలదర్పంబు విజృంభింప నీనేర్పుకొలఁది నమృతంబుఁ గొనివచ్చి మా కిచ్చి నీవు సిద్ధసంకల్పుండవై సుఖంపు మనిరి. అప్పుడు గరుడుఁడు, ' తమ్ములారా ! ఎంతప్రయాసపడియైన నమృతంబు గొనివచ్చి మాయమ్మకును నాకును గల దాస్యంబునుండి విముక్తుల మయ్యెద ' మని చెప్పి గరుడుం డచ్చటనుండి తల్లిం దర్శింపఁ జనియెను.

—♦ గరుత్మంతుఁ డమృతంబుఁ దెచ్చుటకుఁ దల్లి యనుమతిఁబడయుట ♦—

గరుడుఁడు తల్లియొద్దకుఁజని నమస్కరించి కద్రూనందనులకును దనకును జరిగిన వృత్తాంత మంతయును దల్లి కెఱుకపఱిచి " యమృతహరణార్థం బరిగెద, నాశీర్వదింపు " మన, వినతకును గొమరు నెడఁబాయుట కించుకంత చింత గలిగెను గాని, పున్నమనాఁటి వెన్నెల సన్నసన్న చీఁకటులఁ బాఱ ద్రోలినటుల, దాస్యవృత్తి నశించు నను మహానంద మాచింతను గప్పివైచినది.

విన్ననై యున్న యావినతవదనము కుమారునిమాట వినినంతనే నూతనవికాసము నొందెను. నిరంతరచింతాకీలలచే వాడివత్తయైయున్న యామెచిత్తకుముదము క్రొత్త కాంతులచే నొప్పారుచుండెను. కాలవశంబున నాపదలు సంభవించినను

వీరమాతకును వీరపత్నికిని నవకీర్తిచంద్రికల సంపాదించుచుం డును. వీరమాత యగు మనవినతయు నట్టే యశోధవళితా శేషదిగంతరయై తోడిచెలులకు మార్గదర్శిని యగుట యెల్ల రకుఁ దెలిసియే యున్నది.

అంత వినతకొడుకును దొడపై నిడుకొని శిరంబుమూ ర్కొని ముద్దుబిడ్డా! నీవు కానరాని గడియలు నాకు యుగంబు లగును. నిన్నుఁ జూచుకొని యపరిమితవేదనాకరం బగు నీదా స్యమును భరించుచున్నాను. నీవు లేకున్న నరణ్యతుల్య మగు నీగృహాంబున నన్నాదరించువా రెవ్వరు? నీవు గానరాని చింత యొకయెడ, నీవుచేయుపనులుగూడ నాపైఁ బడుటవల నఁ బనిపాట లధికమగుటచే నలమట యొక్కయెడ నన్ను వేధించుచుండ నెట్లు మనఁగలను? కుమారా! కార్యగౌర వము నిన్నుత్సాహవేగములకుఁ బురికొల్పుచుండఁ బయ నంబున కుద్యమించుచున్న నిన్నిప్పుడు వత్తువని యడు గుటవలనఁ గార్యహాని యని యెంచిగియుండియును, నిన్ను విడువఁజాలక యడ్డుదుగుచుంటిని గాని పనిదీక్షనతక్షణము బయలువెడలి రమ్ము. నీకొఱకెదురుచూచుచుందును. తండ్రీ! పోయి విజయలక్ష్మిఁ జేకొని రమ్ము" అని యాశీర్వదించెను.

అంతట గరుడుఁడు "అమ్మా! పోయి వచ్చెదను. కాని, అమృతమును దెచ్చునప్పుడు నాకు మిగుల బలకర మగు నాహారము నిడు" మని యడిగెను. వినతయు శ్రేత్రు

విజయాకాంక్షి వగు నీ కశక్యం బెద్దియును లేదు. సముద్రోదరంబున దాఁగియుండి లోకముల శోకములపాల్సేయుచున్న నిషాదసమూహము నొక్కతుటికాలములో భక్షించి కుక్షి నింపుకొని యిచ్చవచ్చినతెరువునఁ జని కార్యసిద్ధి వడయుము. ఇఁక నొకమాటఁ జెప్ప మఱచితిని. నిషాదగణంబును మ్రింగునపుడు బ్రాహ్మణుఁ డాసంఘమున నుండెనేని వానిని విడిచిపుచ్చుము." అని కుమారునకు హితోపదేశ మొనర్చెను.

తనతల్లిమాటల నాలించి గరుడుండు, "అమ్మా! బ్రాహ్మణు నెట్లెఱుంగ నగునో ఆతెఱంగు వివరింపు" మని యడిగిన, "మ్రింగునవసరంబున నెవ్వఁడు నీకంఠబిలంబునఁబ్రవేశించినతోడనే గాలముపోలిక గ్రుచ్చుకొని యొక్కింతదడవున కగ్గివలె మండునో, యాతనిని బ్రాహ్మణుఁ డని యెఱుఁగుము. కుపితుండగు బ్రాహ్మణుఁ డొక్కొక్కతఱి ఘోర నారాచమువలె భేదించును. మఱియొకయెడ నతఁడు మహావిషమయుఁడగును. ఇంకొకతఱి నతఁ డగ్నికీలయగును. ఆతఁడు పూజ్యుం డయ్యెనేని ప్రజల కభిమతార్థసిద్ధికరుం డగు, గురుఁ డగు, నజేయుఁడగును. ఆతఁ డిన్నిట నతిసమర్థుండు గావున బిడ్డా! ఎప్పుడైన నెవ్వరికైన బ్రాహ్మణనింద సేయఁజన"దని వినత పలికెను.

ఆమాటలు విని గరుడుం డామెకు నమస్కరించి పయ

నంబై యతివేగంబునఁ బఱచి గభీరసముద్రోదకంబుల డాఁగి యున్న నిషాదగణంబును పాతాళవివరంబువలె నిడుపగు తన కంఠబిలంబుఁ దెఱచి యందఱ నొక్కసారిగ మ్రింగిన వారి లో నొక్కవిప్రుం డుండి కంఠమునుండి యావలికిఁ జనక యగ్ని కంబు నధికంబుగ వేధింపనారంభించెను. అంత గరుడుండు తనతల్లిమాటలఁ దలంచుకొని తనకంధరంబున విప్రుం డుండ నోపు నని తలంచి, నాకంఠంబున విప్రుండు గలఁడేని వెలికి రావచ్చు నని తెల్పిన నాతనికంఠబిలంబునఁ జొచ్చిన విప్రుండు గరుడునితో నిట్లు వచించెను.

"అయ్యా! నేను బ్రాహ్మణుండను. కిరాతస్త్రీయగు యను నిషాదాంగన నాభార్య. ప్రవేశించునప్పు డామెసహితంబుగఁ బ్రవేశించితిని. ఇప్పు డామెను విడిచిపెట్టి నాయొక్కప్రాణము రక్షించుకొనఁదలంచిన నాశ్రితఘాతుకతాదోషమునకుఁ బాల్ప డవలసియుండును. ఆశ్రితజనవిసర్జన మెవ్వరికిం జేయఁదగనిది. నమ్మిననారిఁ జెఱుపఁజూచుట యధర్మము. కావున నీముదల యయ్యెనేని యామెసహితంబుగ వెలికి వచ్చువాఁడ" ననిన బ్రాహ్మణుని ధర్మానకికి గరుడుం డానందించి యిట్టిధర్మవిర తులు గావుననే విప్రులమహిమాతిశయంబులు గొనియాడఁ దగియుండు నని తలంచి, "ద్విజోత్తమా! విప్రులు బ్రాం దినవారైనను పవిత్రులైనను బూజ్యులే. కావున నామెయు నీవు నివలికి రం" డని సాదరపురస్సరంబుగఁ బలికిన నిషాదీసహి

తుండై శాఖాగ్రముం డీవలికి వచ్చి గరుడుని దీవించి తన నివాసంబునకుఁ జనియెను.

అంత వినతానందనుఁడు గగనంబున కెగసి తండ్రి యగు కశ్యపుం గని వినతి గావించెను. అతఁడును మించిన ప్రేమగౌరవంబులతో నాతని నాదరించి యాగమనకారణం బడిగెను. అందుల కాతఁడు "మహాత్మా! మాయమ్మ దాస్యము నుడుపుటకై యురగుల కమృతముఁ దెచ్చి యీయ నొప్పుకొంటిని. సముద్రోదరంబున నున్న నిషాదభక్షణంబున నాకడుపున కొక్కకబళంబైనను గాలేదు. నాకడు పగ్గివెట్టి నట్లు మండుకొనిపోవుచున్నది. ఈయాఁకలివాయు నుపాయముం దెలిపి యాశీర్వదించి నన్నంపుఁడు." అనియెను.

## — గజకచ్ఛపులు. —

కొడుకుకడంకకు సంతసించి కశ్యపప్రజాపతి "పుత్రా! నియమవంతులును వేదవేదాంగపారగులును, తేజోవంతులును నగు నిరువురు సోదరులు గలరు. వారికి విభావసు సుప్రతీకు లని పేరులు గలవు. పిత్ర్యంబగు ధనంబు ధర్మపద్ధతి ననుసరించి పంచియిమ్మని యొకదినము వచ్చియగ్రజు నవరజుఁ డడిగెను. విభావసుఁడు కోపోత్తేజితుఁడై యనుజుని గజంబవగు మని శపించెను. అంతటఁ దమ్ముఁడూరకుండక నీవు కూర్మంబవగు మని ప్రతిశాపం బొసఁగెను. ఎంతమహనీయుల

నైనను ధవలోభంబు నిరయబద్ధులఁ గావింపఁగలదు. అన్నయుఁ
దమ్ముఁడును బరస్పరశాపనిబద్ధులై పదియోజనంబులపొడవును
మూఁడుయోజనంబుల వెడల్పును గలిగినకూర్మంబును, పం
డ్రెండుయోజనంబులపొడవును, ఆఱుయోజనంబుల వెడల్పును
గలిగినగజంబునై కాసారారణ్యంబుల నివసించుచు నర్థనిమి
త్తంబైన పరస్పరవిరోధంబులచే నిరతంబు పెనఁగులాడుచుం
డుదురు! ఆరెండుజంతువులు నీకాహారంబులు కాఁగలవు.
వానిని భక్షించి యాఁకలి వాపుకొని చని కార్యసిద్ధి వడ
యుము. పోయిర" మ్మనిన, గరుడుండును మనోజవంబునఁబఱచి
యాజంతువు లున్నయెడ కరిగి యారెండువనచరంబులం గాం
చి యొకకాల గజంబును, రెండవకాలఁ గూర్మంబును బట్టు
కొని యాకసంబున కెగసి పసువిడుచుండ యాతాయాతంబు
లగు గంధర్వవిమానంబు లాతనిపక్షచాలనవాతాహతిఁ గూ
లిపోవుచుండఁ గనకలతావితానంబులచే నలముకొని మందార
వృక్షంబులచే, చుట్టువారుకొనఁబడిన యలంబతీర్థంబునకుఁ
జనునప్పుడు నగంబు లొక్కుమ్మడిగఁ బెల్లగిల్లఁ దొడంగెను.
ఆవృక్షసముదాయంబున రౌహిణేయం బను వృక్షరాజము
గరుడునికి వందనం బాచరించి నూఱుయోజనంబులపొడవుగల
యీనాశాఖపైఁ గూరుచుండి యాగజకచ్ఛపంబుల భుజియించి
విశ్రమించి మఱియరుగు మన నంకులకు వినతానందనుఁడు
వల్లె యని యామహామహీరుహశాఖపైఁ జేరనమకట్టి యుం

దుఁ దనపాదాగ్రంబు మోపెను. సాంతంబుగ మోపకుండఁ గనే యామహీరుహశాఖ పెళ్ళున విఱిగి భోరు మను నినదముతో భూమిపైఁ బడునప్పు డందున్న విహంగజాలము కంగారై నలుదెసలం బాఱె, దెసలు బీటలువాఱె జంతుసంతానం బాతయు భీతిచే వడంకఁదొడంగెను. శతయోజనాయతశాఖను తలక్రిందుగ నాశ్రయించి సూర్యకిరణంబుల నాహారంబుగఁ గైకొని యందుఁ దపం బొనరించుచున్న వాలఖిల్యాదిమహాఋషిగణంబుఁ జూచి యీశాఖ పుడమింబడిన నీమునులకుఁ దపోభంగం బగు నని తలంచి గరుడుం డాశాఖ ముక్కునం గఱచికొని గజకచ్ఛపంబులఁ బక్షమధ్యంబున నిఱికించుకొని వాయుపథంబునఁ బఱచి తనకు విశ్రమింప నిమ్మగుప్రదేశంబును వెదకికొనుచుఁ బోయిపోయి గంధమాదనంబునం దపంబుసేయుచున్న కశ్యపప్రజాపతికి వినతి గావింపఁ, గాంచనాచలము ననుకరించి యత్యంతసత్వసంపత్తి గలిగి హవ్యవాహనునివలె వెల్గొందు వైనతేయుని నతనితుండాగ్రంబున నున్న యాయతశాఖావలంబు లగు వాలఖిల్యగణంబును రెక్కల సందున నిఱికికొని నిక్కినిక్కిచూచు గజకచ్ఛపంబులను జూచి కశ్యపుండు తనకొడుకు జవసత్వంబుల కచ్చెరు వంది, వాలఖిల్యమహాగణంబుల నుద్దేశించి "మునిముఖ్యులారా! యిగ్గరుడుండు జగద్ధితకార్యధురంధరుం డగు మహాబలుండు. ఈశాఖ శాఖం దిగవిడిచిన మీకును లోకంబునకును హానియగు నను

తలంపున దీని మోచికొని తిరుగుచున్నవాఁడు. కావున వీనిం గనిపించి మీరింక ప్రదేశంబున కరుగుం" డనిన నాకశ్యపు ప్రార్థనము నంగీకరించి, వాలఖిల్యులు ప్రాలేయాచలప్రాంతంబున కరిగిరి. గరుడుండును దనచంచుపుటంబున నున్న శాఖను విడువక యే "తండ్రీ! భూదేవరహిత మగు నరణ్య మైనం దైనఁ గలదేని యయ్యది నా కానతిండు. అంతదనుక నిది నాచంచువునఁ బట్టియుండెదను" యనియెను.

అతని యపారమగు సామర్థ్యమును, బ్రాహ్మణభక్తియును పెద్దలయెడ ననురక్తియును, ననుపమానమగు శక్తియును గానియాఁడదగి యున్నవి అతఁ డపారశక్తిసంపన్నుఁ డయ్యును దాఁ జేయుపనుల కిన్నిటికిఁ దలితండ్రుల సెలవుపొందక చేసినట్లు కనఁబడుట లేదు. ఇట్టిగుణవంతులే లోకంబునకు మార్గదర్శకులై యలరారు చుండుదురు.

అప్పుడు కశ్యపుఁడు "కుమారా! ఇచ్చటికి లక్షయోజనములదూరంబున నిష్పురుష మను నొకపర్వతము గలదు. అదియమానుషము. దేహధారుల కైన నగమ్యము. అచ్చోటు డాసి యీశాఖ నందు విడువుము. నీకు మేలయ్యెడు" నన గరుడుండును గశ్యపప్రజాపతికి నమస్కరించి, వాయువేగంబునఁ బఱచి యానిష్పురుషనగంబునఁ దదీయశాఖను బడవైచి హిమవంతంబునకుఁ జని విశాలపక్షంబుల నిమిడికొనియున్న గజకచ్ఛపంబుల నాచఱియపై నిడుకొని కడుపార భక్షించి

కొంతదడవు విశ్రమించి (బేవునఁ దోన్చి మహాసత్వనంపన్నుం డై, దేవలోకంబునకు బోవసమకట్టి నిజపక్షవిక్షేపంబుఁ జేసినఁ దద్వాయుసంచలనంబునం దత్ప్రాంతమహీరుహంబులనుండి కుసుమంబులు దొరంగ నమృతార్థియై యరిగెడు గరుడుని ధైర్యసాహసోత్సాహంబుల కలరి దేవతలు గురియించిన పుష్ప వర్షముపలె నొప్పుచుండెను.

—♦ ఇంద్రలోకంబున నుత్పాతంబులు జనియించుట. ♦—

దేవలోకంబున నింద్రసభామధ్యంబున నింగలంబులు వర్షించెను. ఇంద్రాయుధము కుంఠీభూత మయ్యెను. దిగ్దం తులమద మడఁగెను. సకలదిక్పాలహృదయకుహరంబులు చిల్లు లువోయెను. ఇట్టు లనేకోత్పాతంబు లుదయింప దేవపతి గూడ చెదరిపోవఁ దనసమీపంబున నున్న బృహస్పతిం జూచి యిట్టియుత్పాతంబుల కెయ్యది కారణం బని యడిగినఁ ద్రికా లవేది యగు గురుండు దాని నెఱింగి దేవపతిం జూచి యిట్లని యెను. “ ప్రభూ! ఈయుత్పాతంబులకు గొప్పకారణంబు గలదు! మహాసత్వ తేజోనిధి యగు పక్షికులనాయకుఁడైన గరుత్మంతుం డమృతహరణార్థమై వచ్చుచున్నట్లు నాదివ్య దృష్టికి గోచరించుచున్నది ” అనియెను.

అంత దేవనాయకుం డగు నింద్రుఁడు సగర్వముగ, “ నేమేమీ! యతఁ డంతబలవంతుఁ డయ్యెనే? నిజంబుగ

నిన్న మొన్న నాకన్నులయెదుటఁ బుట్టినవాఁడు! ఇంతధైర్య సాహసకార్యముల నుత్సహించుచుండుట నాకెంతయుఁ జోద్యంబుగ నున్నది. అతఁడొంటరిగ వచ్చి యీనాకలోకంబుఁ జొచ్చుట కుద్యమించుచుండెనే? అతఁడేమియుఁ జేయఁజాలఁడు. అమృతముఁ గొనిచనుట యెందులకు? ఎవ్వరికొఱకు? ఇతని కింత జవసత్వంబులు గలుగుటకుఁ గారణంబుఁ దెల్పు" మని యడుగ బృహస్పతి యీరీతి నుడివెను.

"కశ్యపబ్రహ్మ వరదానబలంబున నతఁడు వినతాదేవిగర్భంబున నుదయించి చిరకాలంబునుండి యుదధిగర్భంబున దాఁగియున్న నిషాదగణంబును భక్షించియు, నాఁకటఁ గృశించుచుంటి నాకాహారంబుఁ జూపు మని తండ్రి నడుగ నతండును గుమాపునికడింధికి సంతసించి గజకచ్ఛపంబుల భుజియింపు మని పనిచెను. ఆతండును వాయువేగంబునఁ జని యాజంతువులఁ గైకొని వచ్చుచు రౌహిణేయం బను వృక్షరాజంబుచేఁ దనయంఘ్రి విశ్రమింపు మని యడుగఁబడి యతం డట్లు చేయు భానుకిరణంబుల నాహారంబుగాఁ గొని తీవ్రతపం బాచరించుచున్న వాలఖిల్యాదిమహాఋషు లాశ్రయించియున్న యావృక్షశాఖ విఱిగెను. అది క్రిందఁ బడినచో వారికి హానికరం బని యెంచి యద్దానిఁ దనచంచుపుటంబున ధరించి వినువీథిం జని తండ్రిని దర్శించి శాఖ జాఱనియక యిది యెచ్చట విడువవలె నని యడిగినఁ గశ్యపుండు నాశాఖ విడుచుప్రదేశం

బతనికిఁ దెల్పఁ దండ్రియాజ్ఞ చెల్లించినాఁడు. ఇప్పుడు తల్లిదా స్యమును నిస్తరింప నమృతంబుఁ గొనిపోవ దేవలోకంబునకు వచ్చుచున్న వాఁడు. అతని కామరూపసంపన్నత, కామగమనము, నపారశక్తియుఁ గొనియాడఁదగినవి. ఆతఁడు నీ కశేయుఁడు. ఆగరుడుని శక్తిసామర్థ్యంబులు నీవు నెఱుంగుదువు. పూర్వము కశ్యపప్రజాపతి పుత్రార్థియై వాలఖిల్యప్రముఖఋషిగణంబును నిన్నును సురగణంబును బిలిపించి మీమీసాయంబుచేఁ బుత్రికామేష్టి సేయు సమకట్టిన నీబలంబునకుఁ దగినభారంబును నీవు మోచికొని వచ్చుచుఁ గుశపలాశాద్యల్పభారవిహితములగు ద్రవ్యంబుల మోచికొని గడగడ వడంకుచు వచ్చుచున్న యల్పసత్త్వుల నంగుష్ఠమాత్రదేహుల ననవరతోపవాసకృశీభూతశరీరుల వాలఖిల్యులఁ జూచి నీవు నవ్వితివి. దానివలన వారును లజ్జాకోపంబులు పెనఁగొన వఁశివాంఛితసిద్ధివిశిష్టుంతును బ్రబలపరాక్రమవిక్రముండును రణశూరుండును కొండవపురుహూతుఁ డనఁదగిన పురుషుని నీవైశ్వానరుం డొనంగుఁగాక యని వీర్యవంతంబులైన మంత్రంబులతో నాహుతాశనునియం దాహుతులు వేల్చుచుండుట నెఱింగి యప్పు డదరిపడి నీవు కశ్యపప్రజాపతి యొద్ద కరిగి నేరక చేసిన యీనాయవజ్ఞతను సహించి వారును మీరును నన్నుఁ గరుణింపుఁ డని వేఁడుకొంటివి. అంతఁ గశ్యపబ్రహ్మ వాలఖిల్యాదిమహర్షులఁ దిలకించి ‹‹ ఋషిసత్తములారా! తినభుజవీ

త్యమున భూతజాలమును రక్షించుటకుఁ బ్రహ్మయోనిచే నీయిం ద్రుండు సృజియింపఁబడియె. రెండవయింద్రుని సృజించితి రేని దైవనియోగంబును విపరీతముసేయుట సంభవించును గావున మీవచనంబు లమోఘంబులు. ఇప్పు డిందుద్భవించు బా లుండు పక్షికులంబున కింద్రుం డయ్యెడు. మీ రిందులకు సమ్మతించి యీతనియింద్రత్వం బేకాధిష్ఠితంబు గావింపుఁ డని వారి నొడఁబఱచెను. అట్టిప్రజాపతి గావించిన యజ్ఞమహిమ చేతను, వాలఖిల్యుల తపోనియమబలంబునను వినతికుఁ బుట్టి న యావిహంగనాయకుం డమృతహారణార్థి యై మనపిటికి వచ్చు చున్నవాఁడు. అందువలన నిట్టి యుత్పాతంబులు జనించెను.'' అని బృహస్పతి చెప్పిన విని దివస్పతి యమృతరక్షకుల రావిం చి రేలుంబవళ్లు జాగరూకులై యమృతమును గాపాడవలయు నని తీవ్రముగ శాసించెను. ప్రభునియానతి వడసి బలపరాక్ర మోపేతు లగు మహావీరులు నిశాతబాణపాణులై రేలుంబ వళ్లు నత్యంతజాగరూకతతో నమృతరక్షకులై చుట్టుముట్టి యుండిరి.

—♦ అమృతరక్షకులతో గరుడుండు యుద్ధము సేయుట ♦—

గరుడుండు గగనంబునుండి వచ్చినప్పు డాతనిపక్షాని లాహతిచేఁ దూలిన వారిదపంక్తులు దూదిపింజెలవలె చెల్లా చెదరై గన్పట్టుచుండెను. అట్టియెడ జవసత్వసంపన్నుం డగు

గరుడుండు మనోజవంబున వచ్చి యమృతం బున్నమందిరం బునకు వచ్చెను. అమృతపాలకులు గరుడునితోఁ దలపడి పరస్పరమును ఖడ్గాదిసాధనంబులతోడ వారును పక్షాదిసాధనంబులతోడ గరుడుండును జాలసేపు సమరంబు గావించిరి. గరుడుండును దనపక్షవిక్షేపవాతోద్ధూతరజోరాజిచే స్వర్గపట్టన మంతయుఁ గప్పివైచిన నది యంతయు నంధకారవ్రాప్తమై నిరవలోకనంబగుటవలన నమరేంద్రుపనుపున వాయుభట్టారకుం డారజోవృష్టి చెదరిపోవునటుల వీచెను. పరశు, కులిశ, కుంత, బాణాది యుద్ధపరికరంబులు ధరియించి కరంబునఁ జక్రంబు కరంబు దీపింప దోర్వీర్యుండగు విభావసుండను నింద్రకింకరుఁడు సనుదెంచి సమరకౌతూహలి యైన గరుడునిం దాఁకి బలవంతుఁ డగు గరుడుని యుదగ్రకోపాగ్నికి శలభంబై యడంగెను.

అంత నవ్విహాగేంద్రుండు తనపక్షాయుధంబునఁ గొందఱఁ, జంచుపుటంబులఁ గొందఱఁ, బదనఖాగ్రంబులఁ గొందఱను బాడిచెను. వారును దూఁటుపడినకుండవలెఁ దమదేహములనుండి రక్తధారలు స్రవించుచుండ హతాశులై వెనుకకు మరలిరి. దేవతలు లజ్జవీడి దేవేంద్రునిపజ్జ కరిగి యాతని మఱుఁగుసొచ్చిరి. గర్వంబుచు బోనాడి సాధ్యులు పూర్వాభిముఖులై పోయిరి. వసువులును, రుద్రులును, ధనహీనవిప్రులచందంబున వెఱచి దక్షిణాభిముఖులై పఱచిరి. ఆదిత్యు లప

తదిక్కు నాశ్రయించిరి. వరుణానల, పవన, ధనద, యమాదు లుక్కుచెడి యొక్కొక్కదిక్కునకుఁ గాందిశీకులైరి.

ఇట్లు నిర్జరలోకంబు నెల్ల నిర్జించి కీర్తిధనంబు నార్జించి గరుడుం డమృతం బున్నయెడ కరిగి, మహావాతప్రేరితంబై యత్యుగ్రాయతం బైన యనలమూర్తిం గాంచి వాయువేగం బునఁ జని సకలనదీజలంబులఁ దనపుక్కిటం బట్టి యశ్రమం బునఁ గొనివచ్చి భీకరార్చులం బ్రజ్వలించుచున్న యయ్యగ్ని నొక్కనిమిషంబున నార్చి దేవనిర్మితమై తీక్ష్ణధారలచేఁ బరిభ్ర మించుచున్న యంత్రచక్రమధ్యంబున సూక్ష్మదేహుండై ప్రవే శించి యాచక్రంబున కధోభాగంబున భయంకరాకారము లును, నిరంతరకోపసంకుచితముఖంబులును, గనకనలాదు నగ్నిగోళంబులం బోలిన కన్నులుగలవియు, నైప్రస్ఫుటానల ధారలం గార్చు నాల్కలఁ జాఁపి యన్యుల వెఱపించుచు నమృతరక్షణార్థమై యతిజాగరూకతతోఁ గాచుకొనియున్న రెండుభుజంగంబులను జూచెను.

తోడ్తోడ నబ్భుజంగంబులఁ దనపక్షవిక్షేపరజోజా లంబున తద్దృష్టిపథంబు గప్పిపుచ్చి వానిశిరంబుల నూకనుచ్చుగఁ ద్రొక్కి పరాక్రమించి యమృతంబుఁ గొని గరుడుండు గగనవీథిం బఱచెను. శత్రువీరు లగు సురలం బోరఁ దెగటార్చి యమృతంబు గొని దాని నాస్వాదింపక నిశ్చలచిత్తుఁడై యత్యు త్సాహంబునఁ గార్యదీక్షాపరతంత్రుఁడై పఱతెంచు గరుడుని

కాశలంబున కచ్చెరువడి యచ్యుతుం డతని కెదురై నీవిజయో త్సాహంబునకు, బలపరాక్రమంబులకు నమృత మరచేతనుండి యు భుజింపనొల్లని నీనిర్లోభతకు, నీనిర్మలభావంబునకు నాకెం తయు మెచ్చువచ్చినది. వలయు దాని నెద్దియేనిఁగోరుమనిన ప్రస న్నుండై యానతిచ్చిన నద్దేవాదిదేవునకుఁ బ్రదక్షిణంబు సేసి గరుడుండు ప్రభూ! జగన్నేతవగునీయందలిభక్తియును నీయగ్ర భాగంబునం దునికియు నమృతపానాస్వాదింపకయ నాకజరామ రత్వంబును బ్రసాదింపుమని యడుగ నావిశ్వగర్భుండా గరుడుని యమోఘవాంఛాపరితృప్తిఁ గావింపసమకట్టి "ఓయీ! పక్షీం ద్రగా, నీవు నాకు వాహనంబవై, ధ్వజంబవై చిరజీవిత్వసిద్ధి వడయుము. పొమ్మిరమ్ము." అన నమోఘసంకల్పుండగు నతం డుసౌక్కుపరిణక్కులు విడల్చి జివ్వున నాకసంబున కెగసిపోవు వానిపై వాసవుండు వజ్రంబు వైవ నాశతధార యగ్నికణం బులఁ గ్రక్కుచు వినువీధిం బఱతెంచు పక్షిపుంగవుం దాఁ కినదానిఁ గని నీతీవ్రజ్వాలామాలికలు నన్ను నొప్పింపఁజాలవు. నీవు మహామునిసంభవంబవు. విశేషించి దేవేంద్రుని చేతి యా యుధంబవు. నిన్ను మన్నింపవలయుఁ గాన నస్మత్పక్షంబునం దొకపర్ణంబు భేదించి, నీవచ్చినదారిని బొమ్ము. నాయెడ నీవు సేయుపకారం బింతియే యని తెల్పి ముందునకుఁ బోవు గరు డుని సాహసికత్వంబున కచ్చెరువడి, సకలభూతనివహంబు లత నిపర్ణసుస్థిరతకు సంతసించి సుపర్ణుం డను ప్రసిద్ధనామము చేఁ

బాగడిరి. దేవేంద్రుఁడును, అతని యపారశక్తిసామర్థ్యంబులకు సంతసించి, యతనితో మైత్రిసేయ నెంచి, యాతని సమీపించి యిట్లనియెను.

ఇంద్రుఁడు గరుత్మంతునిప్రభావంబున కలరి యాతనితో మైత్రిసేయుట.

" ద్విజోత్తమా! నిరుపమానశౌర్యవీర్యసంపన్నుండవగు నీతోఁ జెలిమి గావింపవలయు నని నాకాన వొడము చున్నది. గుణవంతులతోడి నేస్త మవశ్యాచరణీయంబు. అయ్యది యవ్యాజము. నీవన్నన్నో యజరత్వామరత్వములు పొందిన ధీశాలివి. నీ కమృతముతోడి పనిలేదు. దీని నతిప్రయత్నంబునఁ గొంపోయి యన్యులకొఱ కిచ్చితివేని వారలు దీనిని సేవించి యమరులై యమరుల కజేయు లగుదురు. దీన నించుకేనియు నీకుపకరింపదు. కాన నమృతార్థినై వేఁడుచున్న నాకొఱ కీయమృతదానంబు సేయుము " అని పలికెను.

అప్పుడు గరుడుండు, " అయ్యా! అమృతంబు గొనివచ్చి మాకిచ్చితివేని నీతల్లిదాస్యమునకు విముక్తి యొసంగెద మని కాద్రవేయులు పలికిరి. అందునిమిత్తమై యీయమృతమును గొనిపోవుచున్నాఁడను. ఇది గొనిపోయి వారల కిచ్చి మజ్జననీదాస్యనిరాసనంబు గావించికొనినపిమ్మట నాయుకగు లీయమృత ముపయోగింపకుండ నీవు గొనిపొ " మ్మనిన, నిందుఁడు నాతనిమహానుభావత కచ్చెరువడి పక్షీంద్రమా! నీయు

పరాక్రమంబుల కథనము వినవలయు నని యడిగెను. గరుడుం డును "సురేంద్రోత్తమా! ఆత్మోత్కర్షముఁ బరనిందయు సత్పురుషుల కుచితంబులు గావు. అయినను దేవనాయకుండ వగు నీవీచిన్నవిషయ మడిగినఁ జెప్పకుండుట ధర్మువు గాదు గాన చెప్పెద వినుము." అని యిట్లు చెప్పందొడంగెను.

స్థావరజంగమాత్మకం బగు భూమండలంబును నాబలం బున బంతివలె నెత్తియాడింపఁగలను. తరింప నలవిగాని పయోధిజలంబులఁ గొనివచ్చి రత్నసముదయసహితంబుగఁ జల్లెదను. అతిజవసత్త్వసంపన్నంబు లగు మదీయపక్షాంచల సమీరణంబు లోకత్రయంబు నొక్కతుఱిటిలోఁ దిరిగివచ్చు నని చెప్పినఁ బురందరుండు గరుడుని జవసత్త్వసామర్థ్యంబుల కలరి నీవు నాతో సఖ్యంబు నెఱపుము. ఇంకొకసంగతి. నా యభిమతంబు తీర్చితివి. కావున నీ వెద్దియైన వరంబు గోరు మిచ్చెద నన నయ్యండజుఁ డభిముఖుండై పక్షీంద్రుఁడు; అయ్యా! మాకహితులగు కాద్రవేయులు నాకాహారం బగు నట్లు వరం బొసంగుము. ఈసర్పములు నీచే నభిరక్షితం బగు నీజగంబులయందుఁ గ్రిమ్మరుచుండుఁ గావున సర్పాహారరూప మున నాకుఁ గలయీవాంఛితంబును నిన్ను వేఁడుచున్నవాఁడ నని యడిగి పన్నగభోజనత్వంబు నింద్రుచేతం బడసి యతనిచే సెలవుగైకొని కద్రూనందనులయొద్దకుఁ జని మరకతవర్ణవిలసి తంబైన కుశాస్తరణంబుపై నమృతకలశంబు నిలిపి పినతల్లిబిడ్డ

లఁ బిలిచి, గరుడుండు, దేవేంద్రబాహుపరిఘాపాలితంబగు నమృతంబు గొనివచ్చి మీకొఱకొసంగితిని. ఇంక మాయమ్మకును నాకును ఇనచంద్రానలసాక్ష్యంబుగ దాస్యము వాసెను. ఇంక మీరు స్నానము గావించి పరిశుద్ధవస్త్రధారులై వార్చి యనంతరమ దీని నుపయోగింపుఁ డని వారి కది యొప్పించి, తల్లిఁ దనవీపుపై నెక్కించుకొని యాద్విజేంద్రుం డురగుల కదృశ్యుండై చనియెను. ఉరగులు నమృతోపయోగకుతూహలులై యొండొరులు మేము మే మని కాల్యకృత్యంబులఁ దీర్చి స్నాతులై వస్త్రాద్యలంకారములఁ ధరించుకొని వచ్చుటకు ముందుగనే మహేంద్రుఁ డరుదెంచి యమృతంబును గొని త్రివిష్టపంబున కేగి దానిని యథాస్థానంబున స్థాపించి యెప్పటియట్ల రక్షించుకొనుచు సుఖంబున నుండెను.

అంత నయ్యురగు లుత్సాహభరితులై యమృతం బుంచిన స్థానమునకు వచ్చి రిక్తంబగు కుశాస్తరణంబుం గాంచి కటకటపడి చేయునది లేక, కొంతదడవున కమృతకలశం బుంచిన కుశలఁ దమనాల్కలతో నాకిరి. అప్పుడు వారినాల్కలు రెండుగా వ్రేలుటం జేసి వారు ద్విజిహ్వులైరి. మాతృదాస్యనిరాసార్థమై గరుడుం డమోఘప్రయత్నంబున దేవాదుల జయించి యమృతంబుగొని మాతృఋణము దీర్చికొనియెను.

మాతృభక్తితత్పరుం డగు నీగరుత్మంతునిచరిత్ర, వీరపుత్రులకును, వీరమాతలకు నాదర్శప్రాయమై తదితరుల కనుసరణీయమై యలరారుఁగాక !

# జరత్కారుఁడు.

అత్యంత తపోనియమాది వ్రతకృశీభూత శరీరుండును, బ్రహ్మజ్ఞాన తేజోవిరాజితుండును, శమ దమ నియమాది శీలుండును నిత్యసత్యవ్రతతత్పరుండును, బ్రహ్మచర్యవ్రతదీక్షితుండును నగు జరత్కారుం డను మునిపుంగవుండు గలఁడు. అతఁడు కఠోరములగు వ్రతనియమములఁ గావించుచు, వివాహములవలనఁ గలిగెడు నిడుమలం బడనొల్లక, నిరంతరైకాగ్రచిత్తుఁడై చిత్తాగ్రమున హృషీకేశునారాధించుచు తపస్స్వాధ్యాయబ్రహ్మచర్యవ్రతంబులఁ జేసి ఋషిఋణవిముక్తుం డగుచుఁ బ్రకృతియందుఁ బరేశునివిలాసంబును బొడఁగాంచుచు నిత్యానందసంధాయకునిలీలలం బాడుచు స్వేచ్ఛానుసారియై వీతరాగుఁడై యాతాయతవిచలితంబగు భవసాగరమును ద్యజించి బ్రహ్మణ్యుండై, దేవమాతావశిష్టుఁడై పరిభ్రమించుచుండ వనమధ్యంబున నతనికిఁ దృణలతాచ్ఛన్నంబగు పల్వల మొుదు గన్పట్టెను. దానినుండి మనుష్యభాషణంబులు వినఁబడియెను. మిగుల విశాలమును, గభీరమును నగు పల్వలము నుండి మాటలు వినవచ్చుట యెంతయు నద్భుత మని యెంచి, సమీపించి లోనికిఁ దలవంచి పరిశీలించిచూడ నెలుకచేఁ గొఱుకఁబడి యించుకపట్టు గలిగి యిప్పుడో రేపో గభీరజలం

బులఁ బడుటకు సంసిద్ధంబై దానియొద్దనున్న తృణస్తంబం బును, దానిం బట్టుకొని తలక్రిందుగ భానుకిరణంబుల నాహా రంబుగాఁ గొని వ్రేలుచున్నకొందఱు మహాఋషులను గని జరత్కారుఁడు వారి డాయంజని తనలో నీరీతిని దలక్రిందుగఁ దపంబు సేయుటగూడఁ గలదు గాఁబోలును. ఇంతటిభాగ్యము నాకులభింపక పోవుటవలన నిట్లు తిరుగవలసివచ్చిన దేమో యని తలఁచి, పుణ్యాత్ములారా ! మీచే నభ్యసింపఁబడు చున్న మహనీయంబు లగు నీతపోవిధుల నా కుపదేశింపుఁడు, నేనుగూడ నయ్యది యభ్యసించి, ధన్యతముఁడ నయ్యెద నని యత్యంతాసక్తుఁడై యడిగిన నధోముఖులైయున్న మహాత్ము లిట్లనిరి.

"అయ్యా ! అనఘమతీ ! సంతానహీనులమై పుడిసెఁడు నీరును, బిడికెఁడుగింజలును నిచ్చుటకు దిక్కుమొక్కు లేక పట్టుకొన్న యగు నీతృణమూలం బింతయుఁ దెగి పాపకూ పంబునఁ బడిపోవనున్న పాపాత్ముల మగు మాకు మహనీయ తపంబులు లభించుట దుర్ఘటముగదా ? సంతానహీను లగు వా రుత్తమలోకమున కనర్హులుగదా పున్నామ్నో నరకాత్త్రా యత ఇతి పుత్రః " అని ధర్మశాస్త్రంబు ఘోషించుచుండఁ దపోనియమాదులచేఁ గాలముఁ గడపి గృహస్థధర్మము కూరి రకర్మ మని వివాహేచ్ఛ చంపుకొనినవారికిఁ బుణ్యలోకప్రాప్తి యెట్లు గలుగును ? పోనిమ్ము. వారివంశమునం దేపురుషుఁడైన

నుండి యాతఁ డుత్తమకన్యాపరిగ్రహణంబు గావించి అందు మూలంబున సంతానంబుఁ బడసి తమవంశమునకుఁ జెంది యున్న పితృలోకము నుద్ధరింపకున్న, వా రధమగతి నొందవ లసినవా రగుదురు. పక్షుల నుండెడు వేళ్లన్నియుఁ దెగి మూల మొక్కటియుఁ దెగకయుండుటకుఁ గారణము లేకపో లేదు. మావంశంబున నొక్కపురుషుండుమాత్రమే యుండె ననియు, నాతఁడు వివాహితుండై సంతానంబుఁ బడయకున్న మే మధఃపతితుల మగుదు మనియుఁ దెలిసికొని రేపోమాపో యెప్పుడో యేసమయంబుననో పతనకాల మాసన్నమగు నని గుండెలు చేతఁబట్టుకొని కాలము గడపుచున్నాము"

అప్పలుకులు విని జరత్కారుఁడు, "ఋషివర్యులారా! మీరు మాకుఁ బూజ్యులరు. మిమ్ముం జూడ శాంతియ రూ పొందినట్లు గానవచ్చుచున్నది. ఆశ్రమంబుల నెయ్యది యుత్త మాశ్రమమో మీవలన వినవలయు నని కోరుచుంటిని. పత నభీతిచే వెఱపొందుచున్న మీకు శ్రమ మొసంగుట యనుచి తమే యైనను మీవలనఁ దెలిసికొను ధర్మ ముత్తమమైనది యును, వలయునేని యనుష్ఠింపఁదగినదియును నై యుండును గావున నే నింతగ వేఁడికొనుచున్నవాఁడను" అనియెను.

అతనిమాటలధోరణిఁబట్టి ఋషులు వీఁడు మనజర త్కారుఁడు కాఁడుగదా! అనుకొని యైనను గాకున్నను ను త్తమధర్మరహస్యములను వలయు వారికొసంగి పిమ్మటఁ బడిపో

యునను ననుస్నాతలకైన నవి యుపకరింపకపోవు. కావున నీవు హాపురుషుం డడిగిన యీప్రశ్నంబులకు సదుత్తర మిచ్చుట యిప్పుడు మనపనియై యున్నది యని ఋషులలో నొకవ్యక్తి పతనభయంబు విడిచి యేకాగ్రచిత్తుండై జరత్కారు నుద్దేశించి యీరీతి వచించెను.

"బిడ్డా! చతురాశ్రమంబులలో నుత్తమంబగు నది గార్హస్థ్యము. తక్కంగల మూండాశ్రమంబులం బొందినవారికి నుత్తమస్థితి గలుగవచ్చును గాని బ్రహ్మచర్యదీక్షవహించినవారికి నించుకైనం జిత్తచలనంబు గలిగెనేని యధఃపతితు లగుటకు సందియము లేదు. ఎట్టియుత్తమతపోనియతులకైనం జిత్తము నేకాగ్రముగావించుట దుస్తరము. అందు వలన నిహపరసాధనంబులగు గీర్తియుం దపంబును వ్యర్థము లగును. కావున గృహస్థాశ్రమంబును గైకొని ధర్మార్థకామమోక్షరూపంబు లగు చతుర్విధపురుషార్థంబులం బడయవచ్చును. విధ్యనుసారంబుగ వివాహంబు గావించుకొనిన భార్యయందుం గామోపభోగంబులం దనిసి తత్సంతానంబువలనం బితౄణముక్తి నొందవలయును. గృహమేధి ప్రతిదినంబును దేవార్చనము, నతిథిసేవనము, బితృతర్పణము, భూతబలి, అధ్యయనముం గావింపవలయును. ఈమహాభాగ్య మొక్క గృహమేధికే కలదు. అన్నాతురులై కటకటంబడుచు, దాతగృహంబును వెదకికొనుచు జోయునవారిని గృహస్థుండు సమస్తో

పచారంబులఁ గావించి మృష్టాన్నంబు లిడి పరితృప్తులఁ గావిం చును. కారణాంతరములవలనఁ బురుషార్థంబులయం దించుక లోపముగలిగినను తద్ధర్మముల మరల ననుష్ఠించి సిద్ధి నొందఁ గలఁడు. ఇతరాశ్రమములయందుఁ గర్మలోపము గలిగినయె డల నధఃపతితులై చెడిపోవుదురు కావున బిడ్డా! మావంశీ యులలో జరత్కారుం డను వాఁడు తపస్స్వాధ్యాయనిరతుండై వివాహం బొల్లక శరుని కైవడిఁ దిరుగుచున్నవాఁడు. వివాహం బై యుత్తమసంతానంబు వడసి మమ్ముత్తమలోకములకుఁ బం పినఁగాని మాతిపంబులు ఫలింపవు. వాఁడు నీకెందైన గానవ చ్చెనేని మాయీదుస్స్థితి తెల్లముగ వానియుల్లమున కెక్కు నటులఁ జెప్పుము."

అంతట జరత్కారుఁడు నిశ్చేష్టితుఁడై "మహాఋషు లారా! మీయుత్తమగతులకు భంగకారి యగువాఁ డీతఁడే. మీవంశాంకురమును నాశముగావింప నున్న జరత్కారుఁ డను పాపిష్ఠుఁడు వీఁడే. ఏకులపాంసునివలన మీరు పుణ్య లోకదూరులైతిరో, వాఁడే మిమ్ముల నుత్తమగతుల నొందిం పఁగలఁడు. గృహస్థాశ్రమధర్మంబులు మీవలన వినుటచే నీ నాచిత్తమునఁ దారగ్రహణవాంఛ వొడముచున్నది. మీ రలు నాపితృదేవతలు. నేను మీయాత్మజుండను. వివాహం బై సత్పుత్రులం బడసి మీకందఱ కుత్తమగతులు సంపాదించి యెడువాఁడ. మీరు శోకంబుడుగుఁ డనఁ బితృదేవతలు సంత

సిల్లి "తండ్రీ! జరత్కారూ! తనతో సమాను లగు పుత్రు లం బడసి ధర్మపరిపాలనంబు గావించుచుఁ బూజ్యుఁ డని ప్రసిద్ధిఁ గాంచిన మహనీయు లుత్తమగతులు పొందుదురు. కాని ఘోరతర నిష్ఠలఁ గృశీభూతశరీరులై తపంబుగావించువారును సదక్షిణాకంబులగు మహాయజ్ఞంబులు గావించినవారును బుత్రహీనులగు దుష్టాత్ములును వారింబోలి యుత్తమగతులఁ బొందఁజాలరు.

—♦ జరత్కారుఁడు వివాహంబు చేసికొన బూనుట. ♦—

కావున బిడ్డా! నీవు దారపరిగ్రహంబు గావించి యామెవలన సంతానంబు వడసి మాకుఁ బుణ్యలోకప్రాప్తి గావింపు మని యత్యాతురతతోఁ బల్కుచున్న పితృదేవతల మాటలకు వల్లె యని జరత్కారుండు సనామ్ని యగు కన్యనే కాని వివాహంబు చేసికొన నని నిశ్చయించుకొని వారికి నమస్కరించి యట్టికన్యకొఱకు భూవలయంబునం దెల్లయెడలఁ గ్రిమ్మరుచుండెను.

నిరంతరవ్రతనిష్ఠాపరతచేఁ గృశీభూతశరీరుఁడై నిష్కామవృత్తిం దనరారు జరత్కారుఁడు పితృదేవతల యూర్ధ్వలోకప్రాప్తికై వివాహవాంఛఁ దగిలి తనకోర్కి కనురూపమైన కన్యకొఱకు భూవలయం బెల్లఁ ద్రిమ్మరి నొందును గావక విసువుఁ జెందినజరత్కారునివృత్తాంతమంతయు, వాసుకి చారుల

వలన నెఱింగి తనసహోదరి యైన జరత్కారువుం దోకొని జరత్కారుమహామునిసమీపంబున కరిగి యతనితో ఈమె నాసహోదరి, ఈమె పేరు జరత్కారువు, సనామ్ని యగు కన్యకొఱకు మీరు ప్రతీక్షించుచున్నట్లు విని యీమెం దోడ్కొని వచ్చితి నన, జరత్కారుండు వల్లె యని నేఁటికిఁగదా, మదీప్సితంబు ఫలించె నని సంతసింపఁగా, వాసుకియును, జరత్కారునకు నమస్కరించి, "మునీంద్రమా! ఈమెపాణిఁ గ్రహించుటకు నీవు సమ్మతించుటవలన మాకులంబు పవిత్రం బైనది, మేము ధన్యులమైతిమి. మిముబోఁటి జగన్మాన్యుల పాదరజోగ్రహణంబున కైనఁ దగని యల్పుల మగు మాబోంట్లకు మీతోడి సఖ్యసంబంధములు శుభద్యోతకంబులుగదా! జగన్మంగళార్థమై మీబోంట్లు శుభంబుల నాశింతురు. కాని వారికి శుభాశుభంబులును ఖేదమోదంబులును గలవే! విశేకధనాఢ్యులగు మీరు మాన్య యగు నిక్కన్యాభిక్షం బరిగ్రహింపుఁడు."

అని వాసుకి యతనితోఁ దెల్ప, జరత్కారుం డందుల కొడంబడి వివాహంబై ప్రథమసమాగమంబుననె ధర్మపత్నితోడ నొకసమయంబు గావించెను. నామాటకు నీ వెన్నఁడైనఁ బదులు పలికినఁగాని యవమానంబు గావించినఁగాని నిన్నొడఁబాసి పోవుదు నని నిశ్శంకముగఁ దెల్పెను.

వివాహం బైన పరదినంబునుండియు భయభక్తివినయ

స్నేహంబులు రూపొందిన ట్లాయింతి రేలుంబవళ్ళు భర్తృశు
శ్రూషాపరాయణయై నియమభంగం బగునేమో యని వెఱ
చుచు మానిసత్తముచిత్తము ననుసరించి వర్తించుచుండ దినక
రుని గర్భంబున ధరించిన పూర్వదిగంగనామణి తెఱంగున నా
యువతి జరత్కారు తేజోనిక్షిప్తగర్భయై దినమున కొకవింత
చెలువు గలిగియుండెను. అట్లుండ నొకనాఁ డామునివరుండు
పగలు కృష్ణాజినాస్తరణంబున శయనించి గర్భభరాలసయగు
తనయిల్లాలితోడ తలయంపిగా నిడుకొని నిద్రించుచుండెను.
అంత భానుమంతుం డపరశిఖరిఁ జేరుచుండెను. ఆశ్రమవాసు
లందఱును సంధ్యాసమయోచితకృత్యములు గావింప వేగిరప
డుచుండుటను జూచి జరత్కారువు తనలో సంధ్యాకాల మతి
క్రమించుచున్నది. పోనిమ్మని యూరకుంటినేని ధర్మహాని య
గును. అట్లని యిప్పుడు మిన్నకుంటినేని నన్ను నిద్రనుండి
యేల మేల్కొల్పలేదని యేమికోపించునో, నిద్రాభంగం
బొనరించుట కలుకఁజెందునో యేమి చేయుదును, ఏమైనఁ
గానిమ్ము. అతనికోపంబున కెట్టులో తాళుకొందును గాని,
ధర్మహానికి సహింపఁజాల నని నిశ్చయించుకొని యాతనిఁ బ్ర
బోధించెను. అంత నాతఁడు మేల్కని యుగ్రుఁడై యలసి
నిద్రించుచున్న నన్నేల ప్రబోధించితివి ? నీకింత గౌరవ మెం
దులకని విసుగుతోఁ బదరుచున్న మిగులభయపడుచు జర
త్కారువు ప్రాణేశ్వరా ! ఇనుఁ డస్తమింప ధర్మభంగ మగున

నుభయంబున "నిద్రాభంగం బైన నగుగాకని మిమ్ముఁ బ్రబో ధించితి, నాయవజ్ఞత మన్నింపుఁ డని వేడుకొనుచుండ, నాతఁ డంతనైన నిలువక నామేల్కొనునంతకు నినుం డపరశిఖరంబున కరుగునే! వట్టియడియాసచేఁ జేసేత నిట్టిచిట్టెఁ దెచ్చిపెట్టు కొంటివి. కానిమ్ము. ఇప్పుడు నీవు నాకవమానంబు గావించి తివి. మున్ను నాచేసినసమయము౯ గడచువాఁడను గాను. నీగర్భంబున భానుసన్నిభుండు నుభయకులపవిత్రుండును దుః ఖోద్ధరణసమర్థుండును నగు సుపుత్రకుండు వృద్ధినొందుచున్న వాఁడు. అతనివలన నీ వుభయలోకసౌఖ్యముల నందఁగలుగు దువు. విధివిధానంబునకు విచారింపక మీయన్నయొద్దకుఁజను మని యామె నూరార్చి జరత్కారుఁడు తపోవనంబునకుఁ జని యెను. జరత్కారువును నగ్రజునొద్దకు వచ్చి యచటివృత్తాంత మంతయుఁ బూసగ్రుచ్చినట్లు దెల్పి యచట నుండెను. కొన్నిది నంబుల కామెకుఁ బుత్రోత్పత్తి యయ్యెను. ఆబిడ్డఁడు సంపూ ర్ణకళాపరిశోభితుఁడై కన్నవారికనులకును, విన్నవారివీనుల కును విందు సేయుచు అస్తీకుం డనుపేరఁ దినదినాభివృద్ధి నొందుచు నుభయకులంబులను నుద్ధరించెను. కావున గృహా స్థధర్మను నొంది దేవపితౄణవిముక్తులై యుభయకులోద్ధార కులై మెలంగవలె నన్నజరత్కారునిచరితమే నిదర్శనముగ గ్రహించుట యుక్తము.

# కపోతము.

ఆటవికుల కెల్లరకును జంతువధ విలాసముగ నుండును. వారు పక్షులం బెట్టుగూడబుట్టఁ జంకనిడుకొని ధనుస్సు భుజంబునఁ దగిలించుకొని నిచ్చలు పక్షివేటకై యుత్సాహముతో నడవులవెంట గ్రిమ్మరుచుందురు. వారిఁ జూచినతోడనే శాఖాశాఖాంతరముల విశ్రమించి స్వచ్ఛందముగ గానము సేయుచున్న పక్షులు ప్రత్యక్షమగు మృత్యువున కపరావతారమని భావించి తమ బ్రతుకు నాఁటితోఁ గడముట్టినదికా తలంచి చలించుచిత్తములతో నలుఁగెలంకులకుఁ బఱచుచుండును. ఒక దినంబున నొకయెఱుకువాఁ డొకఁడు వలత్రాళ్ళు, చిక్కము, వింటిబద్దయుఁ గూడయుఁగూడఁ జేతఁ బట్టుకొని తొంటితెఱంగున మరల మహాటవీమధ్యంబునకుఁ జనియెను. ఆదినమున నదియేమి చిత్రమో గాని అతడు బయలువెడలునప్పటికి నిర్మలముగ నున్నయాకసమున నుఱుములు, మెఱుపులు, నపారమగు పెనుగాలియు వానయుఁ గ్రమ్ముకొనివచ్చి యాకాటియందలి జంతుసంతానంబున కంతకును నాశన మాసన్న మగునట్లు మిఱ్ఱుపల్లము లేకమగునట్లు కుండబోఁతవలెఁ బెద్ద వాన కురిసెను.

నిరంతరజీవహింసాతత్పరుం డగు నాబోయ తానొకటి దలఁచిన దైవమొకటి దలఁచినట్లు బలిసిన పెద్దపక్షులను బట్టుకొని గృహంబునకుఁ జని భుజించి సుఖింత మని పేరాసచే

వచ్చిన కాఁడ పెద్దవానకుఁ దడిసి వడవడ వణఁకుచు నిలువ నీడయుఁ గట్టఁ గుడ్డయుఁ దాఁగ గంజియు లేక యొకవృక్షమూలము నాశ్రయించి కటికిరాతిఁ దలాడఁగా నిడుకొని శీతబాధయు నాఁకలిబాధయు వేఁచుచుండ నలశయించి యావృక్షము వైపునకుఁ జూచి కరుణామయులగు మహానియులిందెవ్వరైనఁ గలరేని నన్ను రక్షింపవలయును. శరణాగతరక్షణము పరమధర్మమని పెద్దలు నుడువ విందు నని యనుకొనుచుండ నామహీరుహకోటరాంతరంబున వసించిన కపోతంబు లనవల్లభ మేఁత మేసిగూటికిం జేరరామికి వగచుచుండెను.

—• ప్రియునిప్రేమనః పరోక్షమున విని శకుని యానందించుట. •—

గువ్వ తనలో "ఎన్నఁడుగాని నాప్రేయసి యింతదడవు నన్నెడఁబాసి యుండునది కాదు. సంజకెంజాయలు చల్లపడకుండఁగనే యెచ్చటనుండియో వచ్చి నావెనుకఁ జేరి పసికూనలు మనకొఱకెదురుచూచుచుందురు పోదము రమ్మని పిలువ, నొక్క పరువున నిరువురముతు గూఁటికిఁ జేరుకొని బిడ్డలును మేమును సుఖంబుగ భుజించి కలిగినయంతన సుఖించుచుండెడువారము. ఈదినంబున నెందువలననోగాని యామె నాకగపడలేదు. అధికానురాగవతియగుసతిగుణములు, చేఁతలు, మాటలు నాథునికిహపరసాధనంబులు గదా! నాచెలిలేని యీగృహంబు పాడుపడినట్లు గన్పట్టుచున్నది. ఈగాలివాన

కెంపైనఁ దెగియుండనోపు. ఆమేనిఁ జూడని యీమేనికి సుఖ సంతోషంబులు దూరంబులుగదా ? ఈబిడ్డల నెవ్వరిపాలు గావింతు? ఏనాఁడును నామాట కెదురాడక నాచిత్తమును బట్టి మెలఁగు నాప్రాణప్రియఁ జూడక యెట్లు మనఁగలను. ఒంటిజీవనంబు దుఃఖభాజనమేగదా ? తాఁ గొనివచ్చిన యెడ నాకిడక యొక్కఁడునంబున నైన భుజించియెఱుఁగదు. నాతోడ మచ్చునకైనఁ బొలయల్కలకుఁ జొచ్చియెఱుఁగదు. వేయేల? నాతోడిద లోకం బని కాలంబు బుచ్చు కాంతామణిఁ గానక యెట్లు జీవింపఁగలను. ఒకవేళఁ బ్రతికితిఁబో యందువలనఁ బ్రయోజన మేమున్నది. దీపశిఖాన్య-ముగుగృహ మెందులకు? ప్రాణములో ప్రాణమై మెలఁగెడు ప్రియురాలి నెడసి యీ మోఁడికట్టై జీవించుట యెందులకు ? నిజముగ నాగుండె విధాత తాతఁ గావింపఁబోలు. లేకున్న వ్రియ్యలు గాకుండు నా" యని విలపించుట బోయవానివలయందున్న కపోతి విని "తనపరోక్షమునఁ దన్నుగూర్చి పలుకుచున్న ప్రియాలాపంబులు వినినయువతిగదా పుణ్యవతి. పతిమదికి మెచ్చువచ్చునట్లు మెలఁగిన గుణవతియేగదా సతీమణి. ఇఁక నాజన్మము ధన్యమైనది. నన్నుఁ జేకొన్న నాటనుండియు నమూల్యప్రేమచే నలరింపఁజేసిన నామనోహరునితో కడసారి మాటాడి యింక నాయాశాబంధమను దెంపుకొందునుగాక" యని యవ్విహంగాంగన నిజనాథు నుద్దేశించి, "నాబహిఃప్రాణమా! నేని

బోయవలలోఁ దవ్వులోఁ బడితిని. ఇంక వెడలునుపాయము గాన రాదు. మన స్నేహబంధము నిన్ననే వీడిపోయినది. వలువాత లేచి పయనమై యీనరాధముని కటకుచూపులకుఁ బాల్పడి తిని. ఒకరి ననవేల? విధివిధాన మెవ్వరు మాన్పగలరు ? ఎన్ని దినములు బ్రతికిన నాశాలతలు కొనలుసాగుచునే యుండును. రాతిని విసరివైచి రత్నమును గైకొనినయట్లు పతనశీలమగు తనువును బణముగా నొడ్డి యజరామర మగుకీర్తిని గడించుట యుక్తము. ఇప్పు డీబోయ చలిబాధచే వడంకుచుఁ బ్రాణ రక్షణోపాయముఁ గానక భీరువుభంగి మిమ్ము శరణు వేఁడుచు న్నవాఁడు. శరణాగతరక్షణము పరమధర్మ మని పెద్దలు పల్కుదురు. మన కెగ్గు గావించినయతనిని విద్వేషింపక యోపినతెఱంగున నాతని కుపకృతి గావించి పుణ్యమునఁ బొమ్ము."

అని తనసతీమణి పల్కినఁ గడుఁగడు వగచి కర్తవ్యకా ర్యమునందలి శుభాశుభంబులఁ దలంచి దైవగతికి దురపిల్లుట చాలించి, ఆబోయ నుద్దేశించి మనుష్యభాషణంబులతో "అన్నా నీయంగకంబులు ఎజవజ వణఁకుచున్నవి. నోటమాట వచ్చుటలేదు. నీవైఖరిఁజూడ శీతబాధచే మిగుల డస్సినట్లు గన్ప ట్టుచున్నది. చైతన్యహీనుఁడవై యాత్మరక్షణకై యన్యుల వేఁడుచున్న నీదీనతంగనిన నాకెంతయు జాలి వొడమచున్నది. నా చేతనైన తెఱంగున నీకు సాయము సేయఁగడంగితిని. నాయిం

టికి నీవతిథి నైతివి. నీకు వలయు పదార్థంబు నర్థింపుము.'' అనవుడు నాయెఱుకువాని కెంతయు బ్రియంబయ్యెను. చిత్తము త్తేజిత మగుడు దాతనితో ''పతత్రిపుంగవా? నీయుపకారబుద్ధి యెంతయుం గొనియాడందగినది. ఇట్టి శరణాగతరక్షకులు కొంద ఱుండుటచేతనే దిక్కుమొక్కులేని నాబోంటి దీనులకు రక్షణము కలుగుచున్నది. చలిబాధచే మిగులం దూలిపోయితిని. అందువలన నాయొడలు నాయది గాదు. ఇప్పటి యీబాధం బాపి రక్షింపు'' మన, నాతనియీాప్సితమూను విని విహంగమం బతిత్వరితంబున నాచుట్టుపట్టుల నున్న చిదుకులం దనముక్కున నేర్చితెచ్చి పోగిడి పరిసరంబునం గల పల్లియ కరిగి యింగలంబుగల చిదుకుచు ముక్కునం గఱచికొని వచ్చి యాచిదుకులయం దిడి రవులంజేసి యన్నా! మండుచున్న యీయగ్గికడం జేరి నీయొడలు కాచికొమ్ము. లెమ్మని యెంతయుం బ్రేమ దీపింపం బల్కెను. ఆయెఱుకును దనయొడలంతయు నయ్యనలంబున గువ్వ కానందంబు నివ్వటిలం గాచికొని చలి యడంగినపిదప ఆంకలిబాధ యతిశయించి వేధింప నాతని కెటింగింపం బక్షిపుంగవుండును జేయునది లేక కొంతదడవు విచారించి యేమియుం దోంపక రిత్తవడి పిమ్మట నతనితో పక్షులకు జీవనసామగ్రి నిలువంజేసికొనుటయుంగూడం గలదే! దినదినంబును దొరకెకి కుట్టిమ్మరి దొరకినది తిని ముక్కునం గఱచికొని తెచ్చినదానిని ఱెక్కలురాని పోతంబుల

కిడి కాలము బుచ్చుచుండుము. ఇప్పుడు నీవాఁకట డస్సిన వాఁడవై మాయింటి కతిథివైతివి.

—♦ గువ్వ తనశరీరంబును బోయవాని కాహారంబుగా నిడుట ♦—

ఆఁకట నకనకం బడుచున్న నిన్నుఁ జూడ నాగుండె వ్రీలిపోవుచున్నది. ఒక్కయతిథిని తృప్తిపఱుపఁజాలని యీ బ్రతుకు వ్యర్థము గావున నాశరీరము నీకాహారముగా నిచ్చెదఁ గొను మని జ్వాలామయమై వెలుంగుచున్న యగ్నిని వల గొని నిశ్చలచిత్తంబుతోఁ దనయక కపోత మా గుజికెను.

అందులకు బోయ నివ్వెఱపడి యిట్టిపౌరుషకర్మ మెచ్చటనైనఁ గలదే. వీనికారుణ్య మెంతయు గొనియాడఁ దగియున్నది. దుష్టాత్ముఁడ నగునాకు నీవులుఁగు సద్ధర్మముల బోధించు పరమగురు వైనది. అక్కటా! నేను బుట్టిననాఁటనుండియుఁ జేయు ఘోరకార్యము లగణ్యములు. నిర్దయాత్ముఁడనై యిదివఱకు లెక్కలేని జీవకోటుల నంతమొందించితిని గాని యిట్టిపరమగురువును గాంచి యెఱుంగను. తనబంధుమిత్రులను భార్యాపుత్రులను విడిచి తెంపరియై పెంపుమీఱిన వైరాగ్యసంపదచే పాపంబులఁ బోద్రోచికొని స్వర్గద్వారం బరికట్టిన తెఱంగు స్తవనీయం బని తలంచునంతలో దైవవశంబున నభ్బోయహృదయంబున నిర్వేదాంకురములు బయలు దేర మహాప్రస్థానయాత్రాసక్తుఁడై చివ్వన లేచి వలలోని

పక్షుల నన్నిటిఁ బోవిడిచి వలయును, దత్సాధనంబులును నచ్చట విడిచి నియతచిత్తుఁడై యరిగెను. వలలో నుండి విడు వఁబడిన పులుఁగుపొలఁతి తననాథుఁ డగ్నికాహార మగుటకు శోకాయత్తచిత్తయై కటకటంపడుచుఁ గన్నీరుమున్నీరుగ నేడ్చు చు ప్రియా! ఎఱకొరకుఁ బోవుచున్నప్పుడుగాని విహారముగ నరుగునప్పుడుగాని నన్ను వెంటఁ గొనిపోకుండినదిన మిది యే. ఏపదార్థముగాని నాకిడక నీవు భుజించువాఁడవు కావు. నిద్ర నుండి లేచి పరేశునిపైఁ బాటలఁ బాడుచు ననుఁగూడఁ బ్ర బోధించి పాటలోఁ బాట కలిపి పాడఁ బ్రేరేతువు. ఎట్టిచెట్ట వేళ నిల్లు వెడలితినో కాని మరలఁ జేరలేకపోయితిని. నీతోడి యునికి నేఁటితో కడముట్టినది. వికసితకుసుమలతావితానంబుల కడ నన్నుఁ గొనిపోయి మందానిలసారభంబులతీరును నున్నత శిఖరపాతంబులగు సెలయేటినీట నాకుఁ దెప్పలపై విహారంబును నిండారఁ జూచిన మావితోఁటలయందము గనుఁగొందువు రమ్మని వినోదంబుగఁ జేయించుచుండెడివాఁడవు. కమలకాసారతీరంబులకు నన్నుఁ దార్చి యాటలఁ బాటల న న్నలరించుటయును మఱచి జీవించు టెట్లు. ప్రాణతుల్యముగఁ గాపాడు పతిఁ బాసినట్టి హతభాగ్యవతికి నీలోకము నిరయ ప్రాయముగదా! ఇంతకంటె నీతనువు విడిచి నీచన్నజాడ నను సరించుటయే శ్రేయము. ప్రియునియనుమరణంబు సతీమణి కవశ్యాచరణీయ మనియు దాన నుత్తమపదవి గలుగు నని

యుఁ బెద్దలు నుడువ వింటిమి. పతి నెడబాసి వెత నొందుచు నేకాకినినై కాకివలెఁ గడుపు నింపుకొనుచు బ్రతుకుటకంటెఁ బతియనుగమనమే పరమ శ్రేయ మని తలంచి తనకట్టెదుట మండుచున్న యగ్నిని దరికొల్పి యందు ప్రవేశించెను. ఈ వృత్తాంత మంతయు నాకెలన నిలువఁబడియున్న బోయ చూచి యచ్చెరువుపడి తనలోఁ బక్షికులంబున నింతటి యానుకూలదాంపత్యంబు గలదే. ఇప్పలుఁగుచెలువ తనపతితోడిదే లోక మని యతఁడు చన్నమార్గము నధిగమించి సతీధర్మము నెంతసూక్ష్మముగ లోకమునందలి సతీమణులకు బోధించి వారికి మార్గదర్శిని యైనది. మిథునస్వభావ మిట్టిదియే కదా? అల్లదే యాకసంబున మెఱుపుమెఱసినట్లు కన్నులు మిఱుమిట్లు గొల్పుచున్నవి. యని యట్టె చూచునప్పటి కదృశ్య మగుచు బోయ యావిహంగములయున్నతికి వెఱఁగంది నేనుగూడ నీ మేను దొఱఁగుదు నని నిశ్చితాత్ముఁడై త్రోవ తెన్ను గానరాని యడవిం బట్టి శరీర మంతయు ముండ్లచేతను, ఱాలచే నాటఁబడి వ్రీలి రక్తధారలు స్రవింపఁ దెంపరియై భ్రాంతుని వలెఁ బఱచుచుండ నాయడవి యంతయు నగ్గిచే నంటుకొనిరా నందు బడి శరీరము దొఱంగి పుణ్యగతులఁ బడసెను. కావున బిడ్డా! అభయదానంబును సతీధర్మంబును వానివలన నందెదు నిర్మలత్వంబును గొనియాడఁ దగినవి. అట్టివారలు కీర్తికాయులై లోకంబునఁ బరిజ్ఞానపరులకు గోచరించుచునే యుందురు.

# నాడీజంఘుఁడు

బిడ్డా! ఎన్నిదుర్గుణంబు లున్నను సహింపవచ్చును గాని కృతఘ్నతామిత్రద్రోహంబులు గలవానితో మైత్రి ప్రాణహానిఁ దెచ్చును. కావున నట్టివానిమైత్రి ప్రతిమనుజుడును విడువవలయును. కపటి యగువానితోడి మైత్రి ఘటించెనేని నాడీజంఘునివలె ప్రాణములకు దూరులగుదురు. వాని తెఱంగు వినుము. తనకులశీలములఁ దొఱఁగి బోయకాంతను వివాహంబైన యొకపాఱుండు అడవిచెంచులఁ గూడి వేటలాడుచుఁ బచ్చిమాంసము విక్రయించుచుఁ గొంకుజంకు లేక జీవహింస సేయుచు నిచ్చకువచ్చిన ట్లడవిచలు గెలంకుల గ్రుమ్మరుచుఁ గామోపభోగపరాయణుఁడు గావునఁ గలిగినదానితోఁ దృప్తి సనక నతితృష్ణచేఁ బీడితుఁ డయ్యెను. అట్టి తెంపరి చేయఁజాలనికృత్యము లింకేమి గలవు? అతనియాశయము లన్నియుఁ బాపకళంకితములు, హృదయము దురితపంకభరితము, ధనాశాపీడితుం డగు నాపాఱుఁడు చెంచువారల చెలిమివలన బేహారులం గలసి వాణిజ్యము సేయ నుద్యమించి క్రూరజంతుసంతానంబులకు నెలవగు నొకయరణ్యంబునఁ బడి పోవుచుండ నొక్కయడవియేను గాగుంపులోనికి వచ్చి వారల నందర నేలఁ బెట్టి కాలఁజమిరెను. అంత వారు భీతులై హాహాకారంబులు సేయుచు నాగుంపువారు నలుదెసలకుఁ బాఱిరి!

ఆవిప్రుండును వారివెంటఁ బఱచిబఱచి వారిజాడఁ గానక మఱియొక తెరువుఁబట్టి యుత్తరాభిముఖుఁడై పోవఁ బోవఁ గుఱంగట విశాలమై మిగులఁ బొడవయి శాఖోపశాఖలచే నలరి చల్లనిగాలి విసరుచుఁ బరమశాంతునిహృదయము ననుకరించిన యొక్కవటవిటపిం గని యానీడఁ గొంతదడవు విశ్రమించి యాలపుఁ దీర్చుకొన దలంచి కుసుమామోదవిలసితములగు మందమారుతము లాభూదేవునిశరీరమునకు సోఁకుచుండఁ గొండొకసేపట నిద్రించెను. స్వర్గసుఖము దలఁపించు నిద్ర నొంది మెలకువ గలుగునప్పటి కతనికట్టెదుట రాజధర్ముఁ డనుపేరం బరగు నొక్కబకం బాతని కగపడియెను. అప్పక్షియు నవ్విప్రుం గాంచి ప్రియంబేపార నిర్మలచిత్తంబున ‹‹ ఓద్విజోత్తమా! ఎన్నిదినంబులనుండియో యీవటకోటరంబున వాసము చేయుచుంటిని గాని, నాయింటి కతిథు లెవ్వరును విచ్చేసి యుండలేదు. ఈనాఁటికి నాభాగ్యమహిమంబువలన మీ రతిథులై విచ్చేసితిరి. ఎచటినుండి యెచటికిఁ జనుచుంటిరో చెప్ప వలనుపడునేని చెప్పుఁ డనియె. అతండును ‹‹అయ్యా! నేను గౌతముఁ డను నొకయుత్తమచరితునిపుత్రుండ. లఘుబుద్ధినై వేదాధ్యయనాదికర్మలఁ దిగనాడి కామలోలుపతం బోయశాంతం బరిణయంబై ప్రాణిహింస విధాయకకృత్యం బుగఁ బరిగణించి యాటవికులతోఁ గలసి వేఁటలాడుచుఁ, డానఁ దృప్తిసనక ధనార్జనాసక్తిం దగులువడినచిత్తంబుతో

నొక్క బేహారులగుంపులోఁ గలసి యన్యదేశంబుల కరుగుచుండ నొకపర్వతారణ్యప్రదేశమధ్యంబున నొక్కగజ మొక్కమ్మడిగ మాగుంపులోనికిఁ జొచ్చికొండఱఁ దొండంబునఁ గొండఱఁ బాదంబులఁ ద్రొక్కి బీభత్సంబు గావించెను. తక్కినవారు భీయవృత్తి నలుదెసలకుం బాఱిరి. నేను వారివెంట నంటి వచ్చి యొక్కయెడ వారరిగెడిచొప్పుఁ గానక యన్యపథంబుఁ బట్టి రానురాను నాయదృష్టవశంబున నీనిలయంబునకుఁ జేరుకొనఁగల్గితి" ననెను. అప్పు డాబకరాజంబు "మంచిది, నాయింట నీదినంబున నాతిథ్యంబుఁ గొనుము. నీదారిద్ర్యం బపసరిల్లు నుపాయం బరయుదుఁగాక" అని రుచ్యములగు మత్స్యంబులను సుపక్వంబులును మధురంబులు నగుఫలంబులనుఁ దెచ్చి యెంతయుఁ బ్రియంబున నతని కతిథిసత్కారము గావించి పుణ్యకథాలాపంబులఁ గాలము గడపినది. అంత సాయంతనం బగుడుఁ బుష్పపల్లవప్రకరంబుల సుఖశయ్యఁ గల్పించియబ్బకరాజం బాద్విజునితో నిష్టగోష్ఠిం గొంతదడవుండి సుఖనిద్ర నా రాత్రిఁ గడపెను. తెల్లవాఱినంతనే యావిప్రు నవలోకించి భూసురప్రవరా! మనుజుని దారిద్ర్యమునుండి తొలంగించుటకు మిత్రుండును, వెండియును, బంగారంబును, బుద్ధియును నను నీనాలుగుసాధనంబులుగల వని దేవగురుం డగు బృహస్పతి వచించినాఁడు. ఈనాలుగింటను మిత్రుండెక్కుడు. కాశ్యపపుత్రుండ నగు నేను నీతో మైత్రి నెఱపుటవలన నపార

సాధనసంపదలు నినుఁ జేరినట్లే యానందింపుము.

విరూపాక్షనామధేయుం డగు నామిత్రుఁ డొకఁడు గలఁడు. అతఁ డుండునది మధువ్రిజపురంబు. అది యిచ్చటికి రెండుమూఁడు యోజనముల దూరమున నున్నది. నీవు త్వరితంబుగఁ జని యాదైత్యనాయకుని దర్శించి యతనితో నేనంపఁగా వచ్చితి నని నాపేరు చెప్పుము. దానవతఁ డతిప్రీతుండై నీకు వలసినంత ధన మొసంగి తృప్తుం జేసి యుపకంబువెట్టు నని తెల్పి త్రోవఁ జూపి యనిపెను. అంత నాకపటబ్రాహ్మణుఁ డప్పటికిం జని ప్రభువును దర్శించి, రాజధర్మనిప్రియసఖుండ ననియు నాతనిపనుపున నర్థార్థినై వచ్చితి ననియు నతనికి మెచ్చువచ్చున ట్లిచ్చకంబులు పల్కెను. ఆపల్కులు విని దానవనాయకుం డతనిఁ దేఱిపాఱఁ జూచి, తనలో నీపాపుం డధమునివలెఁ గానవచ్చుచున్నవాఁడు. ఇతనిహృదయకుహరమునఁ గ్రూరత్వచోరుఁడు దాఁగికొనియున్న ట్లతని ముఖలక్షణములవలనఁ దేటపడుచున్నది. అయిన నీతని నడిగి తెలిసికొందుఁగా కని యతని నుద్దేశించి, "అయ్యా! మీకేయేవిద్యలయందు పరిచయము గలదు. మీకుల మెయ్యది? మీవృత్తి యెట్టిదియో తెల్పు మని యడిగిన నాకపటబ్రాహ్మణుండు చలింపక తద్వస్థితి నంతయుఁ జెప్పెను. అయినను దానవేశ్వరుఁడు వికృతి నొందక యతఁ డెట్టిఁడైన నేమి? రాజధర్మునితోడిసఖ్య మీతనిఁ బవిత్రునిఁ గావింపకున్న? అతఁడు

సామాన్యుండు గాఁడు. ఇతనితోడ స్నేహించునపు డితనికుల శీలవిద్యావృత్తంబులు పాటింపకుండునంతటి యుత్తమలక్షణము లీతనియందుఁ గన్పట్టుటలేదు. కాని నాడీజంఘునిమహాసఖ్య మితనిని దానపాత్రునిఁ గావింపకుండునా? కావున నితనికి వలయుధనంబు లొసంగెద నని నిశ్చయించుకొని యతని కాహారశయనంబులు సమగ్రంబులుగ నొసంగఁ దగువారల నియమించి మఱుచటిదినంబునఁ గార్తికపౌర్ణమాసి యగుట విద్వత్సహస్రంబులఁ దనగృహంబునకు రావించి బంగరుపళ్ళెరంబుల భోజనంబులు పెట్టించి బహుళదక్షిణ లొసంగుచుండ నావిప్రుండును వారలలోఁ గలసి మనూనీయపూజావిధులఁ బొంది శాల్యోదనంబు భుజించి యతఁ డత్యాదరంబున నొసంగిన ధనంబును భుజించిన పళ్ళెరసహితంబుగ నొసంగిన నత్యంతహర్షావేశంబునఁ గొని మోవఁజాలని భారమైనను మూపున మెడలను నొవ్వ మోచికొని మిగుల నాయాసంబుతో కొక్కెరయున్నచక్కికిఁ జేరుకొనియెను. వటకోటరద్వారంబున మిత్రునిరాక కెదురుచూచుచు నిలువఁబడియున్న నాడీజంఘుఁ డాతనికలిమికి సంతసించి సమీపించి మిత్రమా! పథిశ్రమంబున మిగుల డస్సినట్లు దోఁచుచున్నది. అని తనపక్షయుగ్మంబున మెల్లమెల్లన వీచి యుల్లము పల్లవించు చల్లని మాటలతో నాహారశయనంబుల నొసంగెను. కొంతప్రొద్దైనపిమ్మట నాధర్ముండును సుఖనిద్ర నొందెను.

అంత నాదుష్టబ్రాహ్మణుండు మార్గమధ్యంబున తిండి కొఱకెంతచిక్కు పడవలయునో యని చింతించి బకశరీరం బెంతయుఁ గొవ్వియున్నది. దీనియందలి రుచ్యంబైన మాంసంబు నాకు రేపటిపయనంబునకుఁ జాలును. ఇది యేమఱి నిద్రపోయెడు సమయంబునఁ దీనిఁ దెగ నడిచి మాంసంబు గొనిపోయెదంగాక యని నిశ్చయించుకొని కాసె బిగించుకొని లఁడియఁ జేతం బట్టుకొని దానితలపై మోదెను. ఆబకము చచ్చుటఁ గని యానందముతో దానిఱెక్కలన్నియు నూడ్చివైచి మాసంబంతియు మూటగట్టుకొని తెలతెలవేగుచుండ దారిఁ బట్టిపోయెను.

అట నాతనిమిత్రుఁ డగు దైత్యవల్లభుండు పడక విడిచి తనసఖులతోఁ గలసి మిత్రులారా! ఏమికీడు మూఁడ నున్నదియో గాని యీదినంబున నాచిత్తము మిగులఁ గొందలమందుచున్నది. నాప్రియమిత్రుఁ డగు రాజధర్ముఁడు నిత్యముదయమగునప్పటికి నాయొద్దకు వచ్చుచుండెడువాఁడు. ఈనాఁడు నాపీటికింకను రాకుండుటకు కారణం బుండక పోదు. ఇప్పటికే జాముప్రొద్దైనది. పాపనిశ్చితుం డగునీవిప్రుండు నామిత్రునికేమైన హాని గావించి యుండనోపునేమో యని నాహృదయ మాకులపడుచున్నది. అని యనేకవిధంబుల బేలయై విలపించి కొందఱ మిత్రుల నాతనిజాడ నరయం బనిచిన వారును నతనియాశ్రమంబగు వటవృక్షసమీ

కంబునకు వచ్చి యొలిచి పారవైచిన తెక్కల యీకలఁ గని వెఱగంది యాపాలుఁడు వోయిన తెరువునఁ బోయి యొక యెడ నాదురాత్మునిఁ గని పట్టుకొని తెక్కలు విఱిచికట్టి నిష్ఠురంబు లాడుచు దనుజభర్తసమీపంబునకుఁ గొనివచ్చి యతని కట్టెదుట నిల్పిరి. అంత నారాత్రించరాధిపుం డధికకోపపరీభూతచేతస్కుండై "సేవకులారా! మిత్రఘాతియగు నీకృతఘ్నునిఁ జూచినవార లంధతమోనిబద్ధ మగునిరయము నొందఁగలరు. ఈతనిదేహమును ఖండఖండములుగ ఖండించి మీరు భక్షింపుఁడు. అటులైన నితఁడు గావించిన దుష్టాచరణంబునకు సరిపోవ దని తలఁచెదను." అనియెను. పరిచారకులు ప్రభునికఠినాజ్ఞను శిరసావహింపవలసినవారలే యైనను దురాత్మునిదేహమును భుజించి పాపకూపంబునఁ బడ నొల్లక వారందఱలకు సమ్మతింపకుండుటచేఁ బోనిండు. ఇతని గతి యే మైన నేమి నాయెదుటనుండి తొలఁగఁబెట్టుఁ డని పలికిన తేని వాక్యంబుల కచ్చెరు వందుచు వార లాతనిఁ బురివెలుపలకుఁ దోడ్కొనిపోయి అతనిదేహమును ఖండించుచుండుటను జూచి ఆకట నల్లాడుచున్న శునకంబులుసైతము దిననొల్లక వెనుకకుఁ బాఱెను.

బిడ్డా! కృతఘ్నునిదేహమును గుక్కలుకూడ ముట్టవొల్లవని వేదశ్రుతులు చెప్పురీతి యుప్పట్టునఁ దెల్లంబయ్యెను. అప్పుడు నిప్పులఁ బొరలినట్లు నెయ్యునికొఱకు

నెగు లొందుచున్న యసురభర్త తనచారులచే నతనికంకాళ మును దెప్పించి దాని కగ్నిసంస్కారంబు గావింప మిత్రుని యెడఁగలుగు ప్రేమ గౌరవంబులకు సురపతి సంతసించి "నీస ఖుం డను రాజధర్ముండు నిత్యంబును విధాతృసభాభవనంబు నకు వచ్చుచుండెడువాఁడు. ఈనడుమ నతనియొద్దికి రాకుం డుటకుఁ గడుఁగడు గొందలమంది యతనిఁ దోడితేర నన్నుప వచ్చితి. మిత్రునికాయంబున కగ్నివిధానంబు గావించి మేలొ నరించితివి. ఎంతటిపుణ్యమతి" వని యతనిఁ బొగడుచు సురేం ద్రుండు నీవాతని కంకాళమున కగ్ని యిచ్చి నీవువచ్చినపి మ్మట నాచితిసమీపమున వత్సంబునకుఁ జనుగుడుపుచు కా మధేను వాసమీపమునఁ గసవు మేయుచుండెను. వాయున శంబున దూడనోటినుండి పాలనురు వెగిరి వచ్చి యాపాదపైఁ బడెను. అంతట నన్నాడీజంఘుఁడు సజీవుడై నిజదేహంబు వదలి భగవద్గుణానుభవంబు సేయుచు మిత్రదర్శనంబున కిట వచ్చుచున్నవాఁడు. ఇందుకు కారణము పరేశుని కరుణయే కదా?

ఈరీతి నాతనిఁగూర్చి సురపతి ముచ్చటించుచుండ నా కస్మికముగా నాడీజంఘుఁడు వచ్చెను.

మిత్రదర్శనలాలసుండగు నసురభర్త కాతనిసందర్శన మాతపతప్తం బగుసరోవరంబునకు వర్షపాతంబువలె నానంద పరిద మయ్యెను.

కమలాసనుని యనుశాసనంబున సురపతి యాభూదేవుని బందీకృతుని గావించెను. అయ్యుదంతం బంతయు నాడీజంఘునకు గోచరంబగుడు దనకతంబున నప్పాఱున కిట్టిదీనావస్థ ఘటిల్లుటకు మనంబున మిగుల వగనొంది యతనిని విడిపింపు మని యింద్రుని బ్రార్థించెను.

ఆతఁడును రాజధర్ముని సచ్చరితకు మెచ్చి యతని వాంఛిత మొసంగెను. ఆవిప్రునిధనసంచయ మంతయు నొసంగి దైత్యవల్లభుం డనుప నారాజధర్ముని ధర్మనిరతిం గొనియాడుచు ధనంబు మోచికొని బ్రాహ్మణుఁడు నిజపురంబునకుఁ జనియెను. మిగిలినవారలందఱును దమతమస్థానంబులకుఁ జనిరి. బిడ్డా! బ్రహ్మఘ్నున కెప్పటికైన నిష్కృతి గలదు గాని కృతఘ్నున కెన్నిజన్మములకైన నిష్కృతి యనునది గానరాదు. కాని యింకొకటి వినుము. కృతఘ్నతకంటెను మిత్రద్రోహము దారుణపాపము. కావున నట్టివారిని విడువవలయును. విడువరేని మానప్రాణంబులకు దూరు లగుదురు.

మిత్రుఁ డిహపరంబులయందు శుభంబుల నొడఁగూర్పఁగలఁడు. అందువలన మిత్రధనంబుల రెంటియందును మిత్రస్థానము పూజ్యత నందినది. మనుజుండు శుభంబుల నందఁదలఁచెనేని యుత్తమవంశసంజాతుండును సుగుణఖనియును స్నేహమతియు నగు మిత్రునితోడి పొత్తు సంపాదింపవలయును. కృత

ఘ్నతామిత్రద్రోహంబులవలని పాపంబును సన్మిత్రునితోడి స్నేహంబువలని లాభంబును గ్రహించి మనుట యెల్లరకును శ్రేయోదాయకము.

